# మణిమంజూష




ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి





పద్మశ్రీ పబ్లికేషన్స్

MANIMANJUSA
[A collection of Telugu Articles]

by

Prof S B Raghunathacharya,
Professor & Head , Dept of Sanskrit,
S V University, Tirupati

Copies 1000
1991
Price Rs 20/

For copies
Smt S B Vijayalakshmi,
Padmasri Publications,
6 6 Sri Satya Sai Nagar
Tiruchanoor Road,
Tirupati 517 503

This book is published with the financial assistance
of Tirumala Tirupati Devasthanams under their Schem
AID TO PUBLISH RELIGIOUS BOOKS"

Printed at
Prasad Graphics
3 6 115/5 Hyderguda,
Opp St Marys Jr College
Himayatnagar
Hyderabad-500 029

# ముందుమాట

ప్రొఫెసర్ ఎస్ బి రఘునాథాచార్య
ప్రొఫెసర్ & ఛైర్మన్
డిపార్ట్మెంట్ ఆఫ్ సాంస్క్రిట్

ఎస్ వి యూనివర్సిటి,
తిరుపతి

ఎప్పుడో జరిగిన సంఘటనలను ఇప్పుడు జ్ఞాపకం చేసుకుంటుంటే ఒక ప్రత్యేకానుభూతి కలుగుతుంది మనం ఎంతోకాలం వెనక్కు వెళ్ళిన ట్లనిపిస్తుంది ఆనాటి జీవితానుభవా లెన్నో మనసులో మెదులుతాయి అలాగే ఒక కవిగాని రచయితగాని తను ఎప్పుడో వ్రాసినవి చదువుకుంటుంటే కలిగే అనుభూతి అనిర్వచనీయం ఆ మైమరపించే మధురస్మృతులకు హద్దులుండవు

నేను అధ్యాపకవృత్తి పరిగ్రహించి పాతికవసంతాలు దాటాయి అవసరం ఏర్పడినప్పుడు, ఆవేశం కలిగినప్పుడు అప్పుడప్పుడు రెండు మూడు భాషల్లో కొన్ని కవితలు, వ్యాసాలు వ్రాశాను అవి వాటి స్వభావాన్ని బట్టి వార పత్రికల్లోనో, మాసపత్రికల్లోనో, ప్రత్యేకసంచికల్లోనో పరిశోధనపత్రికల్లోనో, ప్రచురింపబడ్డాయి కొన్ని ఆకాశవాణిలో ప్రసారమైనాయి మిత్రులు కొందఱు వాటి ప్రతులు కావాలని కోరుతున్నారు కాని అవి ఎప్పుడో అయిపోయాయి నాకు కూడా వాటిలో కొన్నింటిని ఒకచోట చూస్తే బాగుంటుం దనిపించింది సంకలనం జరిగింది "మణిమంజూష" మీ ముందుకు వచ్చింది

ఈ మంజూషలో పన్నెండు మణులు మెరుస్తున్నాయి వాటిల్లో మొదటి రెండు శ్రీనివాసుని బ్రహ్మోత్సవాల సందర్భంలో రెండు సంవత్సరాల్లో ఆంధ్రప్రభలో ప్రచురింపబడినాయి విగ్రహారాధకులు ఒట్టి దద్దమ్మలేనా? అనే అంశాన్ని పరామర్శిస్తోంది మూడో వ్యాసం ఇది సప్తగిరిలో ప్రకాశం పొందింది ప్రసిద్ధదేవాలయాలు నదీతీరాల్లో ఎందుకున్నాయి? అనే అంశాన్ని వివరిస్తున్నది నాలుగో వ్యాసం ఇది క్రిందటి కృష్ణాపుష్కరాల్లో "కృష్ణవేణి"లో ప్రచురింపబడింది అయిదునుంచి పది వఱకుగల ఆఱువ్యాసాలు విభిన్నాంశాలపైన విశిష్టంగా వ్రాయబడినాయి ఇవన్నీ అప్పుడప్పుడు ఆకాశవాణిలో ప్రసారం చేయబడ్డాయి పాంచరాత్ర

శాస్త్రంలో ప్రాణాయామస్వరూపాన్ని గురించి చేసిన విమర్శ పదకొండో వ్యాసం ఇది ఇరవై మూడేళ్లముందు సప్తగిరిలో ప్రకటింపబడింది ఆఖరిదైన పన్నెండో వ్యాసం ఆధునికుల అణువిజ్ఞానగవాక్షాలనుంచి ఒక్కసారి కణాదుని వైశేషికదర్శనవైశిష్ట్యాన్ని సందర్శించడానికి చేసిన ప్రయత్నం ఇది జాగృతిలో ముద్రింపబడింది

ఈ వ్యాసాలను రచించడంలోను, ప్రకాశింపజేయడంలోను నన్ను ప్రోత్సహించిన పై సంస్థల కన్నింటికి నా కృతజ్ఞతల నందిస్తున్నాను వారందరి సౌజన్యంతోనే అన్నింటినీ ఒకచోట ఈ మణిమంజూషలో ప్రకటిస్తున్నాను

"మణిమంజూష"ను ముద్రించడానికి ఆర్థికసాహాయ్యా నందించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి, భారతీయ సంస్కృతీ సౌరభభాసురాంతరంగులు ప్రియసుహృన్మణులు శ్రీ ఎమ్ వి ఎస్ ప్రసాద్ గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతా కుముదమంజరుల నందిస్తున్నాను అలాగే ఈ సందర్భంలో సహకారాన్నందించిన మిత్రులు డా రావుల సూర్యనారాయణమూర్తిగారు (పి ఆర్ ఓ), శ్రీ కె సుబ్బారావు (ఎడిటర్) గార్లకు నా ధన్యవాదాలు

ముద్రణ సమయంలో అనేకవిధాల సహాయపడిన బావగారు శ్రీమాన్ సి వి శేషాచార్యులుగారికి, ముఖపత్రాన్ని అలంకరించిన తమ్ముడు చి పాణికి చక్కగా ముద్రించి ఇచ్చిన ప్రసాద్ గ్రాఫిక్స్‌వారికి నా ధన్యవాదాల నందజేస్తున్నాను

'యోగః కర్మసు కౌశలమ్'

శ్రావణపూర్ణిమ,
13 8 1992

-రఘునాథాచార్య

## ఇందులో ....

# మణిమంజూష

## 1. తిరుమలేశుని బ్రహ్మోత్సవం

శ్రీవైకుంఠాన్ని వదిలిపెట్టి, శ్రీనివాసుడై భువికి దిగివచ్చిన స్వామి ఎన్నుకొన్న పరమపవిత్రమైన పుణ్యక్షేత్రం తిరుమల అందుకనే వేంకటాద్రితో సమానమైన క్షేత్రం ఈ బ్రహ్మాండంలోనే లేదని ప్రసిద్ధి ఏర్పడింది కృతయుగంలో కంచి వరదరాజస్వామి, త్రేతాయుగంలో శ్రీరంగం రంగనాథస్వామి, ద్వాపరయుగంలో పూరీ జగన్నాథస్వామి, కలియుగంలో వేంకటాద్రిపై వేంచేసిన శ్రీవేంకటేశ్వరస్వామి ఎంతో ప్రభావం కలవాళ్లనే మాట భారతీయులందరకు తెలిసిందే

ఒక శిలావిగ్రహంలో భగవంతుడు సన్నిహితుడై ఉండి భక్తుల కోర్కెలు తీర్చాలంచే మూడు విశేషాలు అక్కడ పుష్కలంగా ఉండాలి 1 ప్రతిష్ఠ చేసినవాని తపశ్శక్తి 2 అక్కడ నిత్య-నైమిత్తిక-కామ్యోత్సవాల

రూపంలో అతిశయంగా జరిగే ఆరాధన 3 శిల్పశాస్త్రలక్షణాలతో ఉన్న విగ్రహసౌందర్యం ఇది సాధారణదేవాలయాల విషయంలో సరిపో తుంది కాని తిరుమల స్వయంవ్యక్తక్షేత్రం శ్రీనివాసుడు స్వయంగా ఎన్నుకొని ఆవిర్భవించిన దివ్యక్షేత్రం ఎవరో ప్రతిష్ఠ చేసింది కాదు కాబట్టి అక్కడ భగవత్సాన్నిధ్యానికి కొరత లేనే లేదు పైగా ప్రపంచంలో ఇంకే దేవాలయంలోనూ జరగని విధంగా వైఖానసాగమ శాస్త్రా న్ననుసరించి అక్కడ ప్రతినిత్యం అనేకారాధనలు, ఉత్సవాలు జరుగుతుంటాయి ఆ వైభవం అద్వితీయం కాబట్టి ఆరకంగా కూడా భగవత్సాన్నిధ్యం పుష్కలంగా ఉంది ఇక అక్కడ మనకు దర్శనమిచ్చే మూర్తి సౌందర్యం అలోకసామాన్యం ఒక్కసారి దర్శనం చేస్తే చాలు ప్రతివాడికీ కళ్లు మూసుకుంటే జీవితంలో ఎప్పడైనా సరే జ్ఞాపకం చేసుకోటానికి చాలినంత భద్రంగా మనసులో ముద్రపడుతుంది గుండె ఆనందంతో నిండిపోతుంది అందువల్ల దివ్యసుందరుడు, నిత్యకళ్యాణ మూర్తి అయిన శ్రీనివాసుడు, భక్తులు ఆర్తితో 'గోవిందా! గోవిందా!' అని పిలుస్తుంటే 'వో' యని పలికే పరమాత్మగా ఈ క్షేత్రంలో ప్రకాశిస్తున్నాడు

తిరుమలలో జరిగే ఆరాధనలన్నీ వైఖానసాగమాన్ని అనుసరించి ఉంటాయి సంవత్సరం పొడుగునా ఎన్నో ఉత్సవాలు, సేవలు స్వామికి చేస్తుంటారు కాని వాటన్నింటిలోకి బ్రహ్మోత్సవాని కున్న విశిష్టత ఇంకోదానికి లేనే లేదు

ఉత్సవం అంటే ఏమిటి? దైనందినజీవితంలో ప్రతివాడూ ఎదు ర్కొనే దుఃఖసముద్రాన్ని 'సవం'అంటారు మానవుడు దీనిద్వారా ఆ దుఃఖాన్ని దాటుతున్నాడు కాబట్టి దీనికి ఉత్సవమని పేరని ఒక భావన (ఉత్తరన్తి సవం అనేనేతి ఉత్సవః) సంసారబంధాల్లో చిక్కు కొని, నిరాశానిస్పృహలకు లోనై నీరుగారిపోతున్న సామాన్యమానవుడికి మళ్లా తన కర్తవ్యాన్ని నిర్వహించడానికి కావలసిన శక్తిని, స్ఫూర్తిని ఇస్తూ, ఉత్సాహపరచడం వల్ల కూడా దీనికి ఉత్సవమనే పేరేర్పడింది (ఉత్సూతే హర్షమితి ఉత్సవః) ప్రతిరోజూ తిరుమలలో కళ్యాణో త్సవం మొదలు ఇటువంటి ఉత్సవాలు ఎన్నెన్నో జరుగుతుంటాయి అందుకనే 'నిత్యకల్యాణం పచ్చతోరణం' అనే ప్రసిద్ధి తిరుమలేశునికే అసాధారణంగా చెల్లుబడి అయింది

ఉత్సవా లన్నింటిలో తిరుమలలొ జరిగే బ్రహ్మోత్సవం ఎన్నోవిధాల

విశిష్టమైందిగా వివిధదశలలో ప్రశంసింపబడింది దీనికి బ్రహ్మోత్సవమనే పేరెందుకు వచ్చింది?

అలా రావడానికి కారణాలు రెండు మూడు కనబడుతున్నాయి బ్రహ్మదేవుడు మహర్షులతోను, దేవతలతోను కలసివచ్చి మొట్టమొదట శ్రీనివాసునికి ఈ ఉత్సవాన్ని జరిపించినందువల్ల దీనికి బ్రహ్మోత్సవమనే పేరు ఏర్పడిందని భవిష్యోత్తరపురాణం చెబుతున్నది బ్రహ్మలు తొమ్మిదిమంది నవాహ్నికదీక్షతో తొమ్మిది రోజులు ఈ ఉత్సవం జరుగుతున్నది కాబట్టి దినికి బ్రహ్మోత్సవమనే ప్రసిద్ధి వచ్చిందని కొందరి అభిప్రాయం ఏడుకొండలమీద వెలసిన వేంకటేశ్వరుడు ఎవరో కాదు, సాక్షాత్తు సృష్టి, స్థితి, లయకారకుడైన పరబ్రహ్మ ఆ పరబ్రహ్మకు చేసే ఉత్సవం కాబట్టి బ్రహ్మోత్సవమని ఇంకొందరి ఆలోచన అసలు బ్రహ్మ అంటే పెద్ద, గొప్ప అనే అర్థాన్ని చెప్పుకొని, ఉత్సవా లన్నింటిలో గొప్పది కాబట్టి బ్రహ్మోత్సవమనే పేరొచ్చిందనికూడా చెబుతుంటారు ఏది ఏమైనా, ఎలా దీన్ని వర్ణించుకున్నా ఇదొక విలక్షణమైన ఉత్సవమని మాత్రం చెప్పక తప్పదు

ఎప్పుడో ప్రారంభమై పరంపరగా జరుగుతున్న ఈ బ్రహ్మోత్సవం క్రీ శ పదవశతాబ్దంలో పల్లవరాణి సమవాయి (కడవన పెరుందేవి) కాలంలో శాసనాలలో కెక్కింది తరువాత 13 వ శతాబ్దంలో త్రిభువన చక్రవర్తి తిరువేంకటనాధ యాదవరాయలు, 15 శతాబ్దంలో హరిహరరాయలు, 16వ శతాబ్దంలో అచ్యుతరాయలు, సదాశివరాయలు మొదలయిన ప్రభువులు విడివిడిగా తిరుమలేశునికి బ్రహ్మోత్సవాలను జరపడానికి దానాలు చేసినట్లు శాసనాలద్వారా తెలుస్తున్నది ఈ బ్రహ్మోత్సవాలు పదకొండువరకు పెరిగినట్లు దానశాసనాల ఆధారాలు కనబడుతున్నాయి

రోజులు గడిచేకొద్దీ రాజుల చరిత్ర కాలగర్భంలో కలిసిపోయింది కాని బ్రహ్మదేవుడు ప్రారంభించిన 'పురట్టాసి' బ్రహ్మోత్సవం పూర్ణాయుష్యంతో నిలబడి నడుస్తూంది సౌరమానం ప్రకారం ఇది కన్యామాసంలో, అంటే భాద్రపదమాసంలో గాని, ఆశ్వయుజ మాసంలో గాని వస్తుంది కన్యామాసం ఆశ్వయుజమాసంలో వస్తే బ్రహ్మోత్సవాన్ని విజయదశమివరకు నవాహ్నికంగా తొమ్మిదిరోజులు జరుపుతున్నారు కన్యామాసం భాద్రపదంలో వస్తే భాద్రపదంలో ఒక బ్రహ్మోత్సవం, ఆశ్వయుజంలో

నవరాత్రబ్రహ్మోత్సవం అనే పేరుతో ఇంకో బ్రహ్మోత్సవం చేస్తున్నారు

ఈ ఉత్సవం 21 రోజులు జరిపితే అది ఉత్తమం, 14 రోజులు జరిపితే అది మధ్యమం, 9 రోజులుగాని, 7 రోజులుగాని జరిపితే అది అధమం అని వైఖానసాగమం చెబుతున్నది సంవత్సరం మొత్తంమీద జరిగే ఉత్సవాలను 1 కాలోత్సవాలు, 2 శ్రద్ధోత్సవాలు, 3 నిమిత్తోత్సవాలు అని మూడు రకాలుగా ఆగమశాస్త్రం విభజిస్తోంది అందులో బ్రహ్మోత్సవం కాలోత్సవమనే విభాగానికి చెందుతుంది

బ్రహ్మోత్సవానికి ముందు నిమిత్తపరీక్షకోసం అంకురార్పణం చేస్తారు ఇది నిజానికి చాలా రోజులు ముందు జరగాల్సింది కాని ఆచరణసౌకర్యం కోసం ఆహ్నికానికి ముందు దీన్ని ఆచరిస్తున్నారు ఇది ఏ ఆడంబరం లేకుండా జరిగిపోతుంది గరుత్మంతుడి చిత్రాన్ని ఒక వస్త్రంమీద గీచి, అధివాసాలు, ప్రాణప్రతిష్ఠ చేసి, ధ్వజస్తంభంపైకి శుభముహూర్తంలో సకల మంగళవాద్యఘోషలతో పంపించడాన్ని ధ్వజారోహణం అంటారు ఈ ధ్వజారోహణంతో బ్రహ్మోత్సవం ప్రారంభమవుతుంది దీనికి ముందు ఉత్సవశ్రీనివాసమూర్తి పల్లకిపై ఎక్కి చైత్యప్రదక్షిణం చేసి వస్తారు ధ్వజారోహణసమయంలో గరుత్మంతుడికి నివేదించిన గరుడప్రసాదం స్త్రీల వంధ్యాదోషాల నన్నింటిని పోగొడుతుంది అందు కనే సంతానంలేని స్త్రీలు మంచి సంతానం కలగాలని ఇప్పటికీ గరుడప్రసాదాన్ని భక్తిభావంతో స్వీకరిస్తారు

'మా స్వామి బ్రహ్మోత్సవానికి విచ్చేయు'మని సకలదేవతలను ఆహ్వానిస్తారు ఇదే దేవతాహ్వానం సర్వసేనాధిపతి విష్వక్సేనుడు ఆయన శాసనాన్ని పురస్కరించుకొని, గరుడుని ఆజ్ఞతో ఆచార్యుడు దేవతాహ్వానం చేస్తాడు ఆ రాత్రి స్వామికి పెద్దశేషవాహనోత్సవం జరుగుతుంది రెండవరోజు ఉదయం చిన్న శేషవాహనం, రాత్రి హంసవాహనం, మూడోరోజు ఉదయం సింహవాహనం, రాత్రి ముత్యాలపందిరి, ముత్యపుపందిరి మౌక్తికమండపం, నాలుగో రోజు ఉదయం కల్పవృక్షం, రాత్రి సర్వభూపాలవాహనం, అయిదోరోజు ఉదయం పల్లకి, రాత్రికి గరుడోత్సవం, ఆరోరోజు ఉదయం హనుమద్వాహనం, రాత్రికి గజవాహనం, ఏడోరోజు ఉదయం సూర్యప్రభవాహనం, రాత్రికి చంద్రప్రభవాహనం, ఎనిమిదోరోజు ఉదయం రథోత్సవం, రాత్రికి అశ్వవాహనం, తొమ్మిదోరోజు హరిద్రాభిషేకం చేసుకున్న స్వామి పల్లకి మీద అవభృథోత్సవానికి తరలి వెళతారు బ్రహ్మోత్సవం మొత్తంమీద

అయిదోరోజు రాత్రి జరిగే గరుడోత్సవానికి, ఎనిమిదోరోజు ఉదయం జరిగే రథోత్సవానికి ఎంతో ప్రాధాన్యం ఉంది ఈ ఉత్సవాలకు దేశవిదేశాలనుంచి ఎందరో భక్తులు లక్షలమంది వచ్చి స్వామిని దర్శిస్తారు రథంలో వూరేగుతున్న శ్రీనివాసుని దర్శించినవాళ్లకు ఇంకో జన్మ లేదని శాస్త్రాలు చెబుతున్నాయి

ఈ బ్రహ్మోత్సవం సమయంలో తిరుమల అంగరంగవైభవాలతో కళకళలాడుతుంది స్వామిసన్నిధిలో వేదవేదాంతవిద్యద్గోష్ఠులను, సంగీత కచ్చేరీలను, భక్తి, సంగీతకార్యక్రమాలను, ధార్మికోపన్యాసాలను తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఏర్పాటు చేస్తారు దేశం నాలుగు మూలాల నుంచి వచ్చే లక్షలాది యాత్రికులకు దేవస్థానం సిబ్బంది ఏ ఇబ్బంది లేకుండా జాగ్రత్తగా పర్యవేక్షిస్తుంది ఒక్కసారి బ్రహ్మోత్సవాన్ని దర్శిస్తే చాలు, అది మన జీవితంలొ మరపురాని మహొత్సవంగా మిగిలిపోతుంది

# 2. అడుగడుగు దండాలవాడు

చరిత్రకందని కాలం నుంచి పవిత్రపుణ్యక్షేత్రంగా, కలియుగవైకుంఠంగా కళకళలాడుతున్నది తిరుమలక్షేత్రం అండపిండబ్రహ్మాండాలను అవలీలగా సృష్టిస్తూ, పోషిస్తూ, లయింపజేస్తున్న కొండలరాయుడు ఈ కొండలపై కొలువుతీరి ఉన్నాడు సంస్కృతజ్ఞులు సరసంగా 'సప్తగిరీశా' అని పిలుస్తుంటే 'ఏడుకొండలవాడా! వేంకటరమణా' అంటారు ఆరుకోట్ల ఆంధ్రులు

ఏడుకొండలు కోరిన కోర్కెల నిచ్చే కోనేటిరాయడు కొండల మధ్యలో కోరి కోరి ఉన్నాడంటే ఆ కొండ లెంత భాగ్యం చేసుకున్నాయో మరి! మనం నిత్యం చదువుకునే శ్రీవేంకటేశ్వరసుప్రభాతం ఆ కొండల నిలా పేర్కొంటున్నది—

"శ్రీశేషశైల గరుడాచల వేంకటాద్రి
నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రిముఖ్యామ్,

అఖ్యాం త్వదీయవసతే రనిశం వదన్తి
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్!"

కాని కొంచెం తేడాతో 1 శేషాద్రి, 2 గరుడాద్రి, 3 నారాయణాద్రి, 4 వృషభాద్రి, 5 అంజనాద్రి, 6 నీలాద్రి, 7 వేంకటాద్రి అనే పేర్లతో ఏడుకొండలు సుప్రసిద్ధంగా ఉన్నాయి ఈ శ్లోకంలో అంజనాద్రి, నీలాద్రి లేవు వృషాద్రి అధికంగా ఉంది ఈ కొండల పేర్లను గురించి, వాటి చరిత్రను గురించి, భిన్నభిన్నాభిప్రాయాలు ప్రచారంలో ఉన్నాయి ఉత్తరదిక్కునుంచి దక్షిణానికి విస్తరించిన పర్వతపంక్తులు శయనించిన శేషాహిలాగా భాసిస్తున్నాయి ఈ సర్పాకృతిలో తిరుమల శిరఃస్థానంలో ఉంది అహోబిలం పొట్ట, శ్రీశైలం తోక అని పెద్దలు చెపుతారు

**పేరు - ప్రసిద్ధి** ఏడుకొండలకు పై పేర్లేర్పడడంలో ఎంతో చరిత్ర ఉంది శేషుని ఆకారంలో ఉండటంవల్ల "శేషాద్రి" అని, గరుత్మంతుడు ఈ క్రీడాచలాన్ని వైకుంఠంనుంచి భూలోకానికి తీసుకొని రావడంవల్ల 'గరుడాద్రి' అని 'వైకుంఠాద్రి' అని, శ్రీమన్నారాయణుడు శ్రీనివాసుడై ఇక్కడ నివసించడం వల్ల 'నారాయణాద్రి' అని, లేక నారాయణుడనేవాడు తపస్సు చేయడంవల్ల 'నారాయణాద్రి' అని, వరాహస్వామి వృషభాసురుని జయించి అతణ్ణి అనుగ్రహించడంవల్ల 'వృషభాద్రి' అని, అంజనాదేవి సంతానప్రాప్తికై తపస్సు చేయడంవల్ల 'అంజనాద్రి' అని, కపిముఖ్యుడైన నీలుని పేరుతో 'నీలాద్రి' అని, భక్తుల పాపాలను దహించేది కనుక 'వేంకటాద్రి' అని ఈ కొండలకు పేరు, ప్రసిద్ధి వచ్చిందని అనేకపురాణాలవల్ల తెలుస్తున్నది ఇలాకాక ఇతర విశేషాలను కూడా ఈ పేర్లకు చెప్పడం కనబడుతుంది అసలు ఈ పర్వతం శ్రీమన్నారాయణుని శరీరమని, అందువల్లే ప్రహ్లాదుడు, అంబరీషుడు, శ్రీశుకుడు మొదలగు మహాభక్తులు దీనిపైన అడుగు పెట్టడానికి కూడా భయపడతారని కొన్ని పురాణాలు చెపుతున్నాయి

**కాలిబాట** అడుగడుగు దండాలవాడు, ఆపదమొక్కులవాడు, ఆర్తజన సంరక్షకుడు అయిన అలమేలు మంగాపతి తమ అభీష్టాలను అనుగ్రహించిన వెంటనే అనేకకష్టనష్టాలకు, వ్యయప్రయాసలకు ఓర్చి భక్తులు అన్నమాట ప్రకారం ఆపన్నశరణ్యుని దర్శించా లనుకుంటారు స్వామికిచ్చిన మాటను దాటడానికి ఎవరికీ గుండెలు చాలవు పచ్చబట్టలను

ధరించి బంధుమిత్రులతో కలసి 'జోగి' ఎత్తుకొని ఎలాగో తిరుపతి చేరతారు అక్కడినుంచి అలిపిరి గోపురం దాటి తండోపతండాలుగా మెట్లదోవలో 'ఏడుకొండలవాడా! వేంకటరమణా! గోవిందా! గోవిందా! అంటూ మెల్లగా ఒక్కొక్క మెట్టూ ఎక్కుతుంటారు ఇందులో ముసలి-పడుచు, చిన్న-పెద్ద అనే భేదాలు లేవు ప్రతివాళ్లు మొక్కుకున్న ప్రకారం నడిచివస్తానంటే కాలిబాటన నడిచితీరవలసిందే

దాదాపు నాలుగు శతాబ్దాలనుంచి ఘాట్‌రోడ్‌ద్వారా బస్సుల్లో ఎక్కి వెళ్ళే వాళ్ల సంఖ్య పెరిగిపోయింది కాని అంతకుముందు తిరుమలేశుని దర్శనానికి నడిచివెళ్ళి తిరిగి నడచి రావలసిందే నిజంగా తిరుమలపైన దివ్యక్షేత్రమనే భావం, పవిత్రత చెక్కుచెదరకుండా ఉన్న రోజులవి ఈ శతాబ్దంనుంచి కొద్ది కొద్దిగా కొన్ని శతాబ్దాలు వెనక్కుపోయి చూస్తే తిరుమల కొండలపై ఆనాటివారి భావనలు, భాష్యాలు మనకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించక మానవు చూడండి

**ఉయ్యాలబాట** ఈనాడు కష్టపడి మెట్లు ఎక్కి నడిచి వెళ్లే వాళ్ల సంఖ్య తక్కువనే చెప్పాలి వీలైనంత తక్కువకాలంలో ఎక్కువ సుఖంగా వెళ్ళి స్వామిదర్శనం చేసుకోవాలని ఆరాటపడుతున్నాడు ఆధునికభక్తుడు అంతేకాదు ఉయ్యాల బాట (రోప్‌వే) కోసం ఉబలాటపడుతూ ఉవ్విళ్లూరుతున్నాడు చంద్రగిరివైపు రాబోయే ఈ ఉయ్యాలబాట గురించి చాలాసార్లు తర్జనభర్జనలు జరిగాయి తిరుమల బస్సులకోసం రాను రాను పెరుగుతున్న రద్దిని తట్టుకోవడానికి ఇప్పుడు కాకపోయినా ఎప్పటికైనా ఆ మార్గాన్ని ఆశ్రయించక తప్పదనిపిస్తుంది

**మెట్ల ఏర్పాటు** ఒకప్పుడు కాలిబాటన నడచి వెళ్లే వాళ్ళ సౌకర్యం కోసం ఎందరో మహానుభావులు ఎన్నో సౌకర్యాలు చేశారు అందులో శాసనాల్లో పేర్కొనబడ్డ వాళ్లు కొందరే వాళ్లలో మట్లి రాజుల్లో కుమా రఅనంతుడు (క్రీ శ 1628) చాలా ముఖ్యుడు ఇతడు కాలిబాటలో మెట్లు కట్టించాడు అలిపిరి కొండ మొదట్లో కనబడే గోపురం ఈయన నిర్మాణమే ఈయనే తిరుపతిలో గోవిందరాజస్వామికి గాలిగోపురాన్ని కూడా నిర్మించాడు ఇది ఉన్నతశిఖరాలతో తిరుపతి పరిసరాలకు భక్తుల్ని ఆకర్షిస్తూ, ఆహ్వానిస్తూ "నాలాగానే ఉన్నతాశయాలతో ఉండండ"ని

హెచ్చరిస్తూ ఉంటుంది

శ్రీకృష్ణదేవరాయలు ఇటు సాహిత్యరంగంలోను, అటు రాజకీయరంగంలోను దీటులేని మేటి ప్రభువు శ్రీకృష్ణదేవరాయలు (1509-1529) అందుకే ఆయన్ను 'సాహితీ సమరాంగణ సార్వభౌముడ'ని అంటారు ఏడుకొండలస్వామిని మొత్తం ఏడుసార్లు దర్శనం చేసుకున్నాడు శ్రీకృష్ణ దేవరాయలు ఈయనకూడా చంద్రగిరిలోయవైపు ఉన్న మెట్లపైనుంచి తిరుమల వెళ్లేవాడని ప్రసిద్ధి రాయలు మొట్టమొదట 10 2 1513 వ తేదీన తిరుమల వెళ్లి శ్రీవారిదర్శనం చేసుకుని ఆయన అనుగ్రహానికి పాత్రుడైనాడు ఆ తరువాత మళ్లా మళ్లా స్వామిదర్శనం చేస్తూనే ఉన్నాడు స్వామిని దర్శించినప్పుడల్లా రాణుల పేరుతోనో, తన పేరుతోనో ఎన్నో ఆభరణాలను, ఇంకెన్నో కైంకర్యాలను సమర్పిస్తూనే ఉన్నాడు కృష్ణదేవరాయలు అంతరంగశుద్ధితో చేసిన సేవలు ఆనందనిలయుని చేరే త్రోవలు

వ్యాసరాయలు కుహూయోగంవల్ల శ్రీకృష్ణదేవరాయలకు కలిగే విపత్తును శ్రీకృష్ణపదపద్మారాధనంతో అవలీలగా తప్పించిన మహామనిషి, మహాతపస్వి శ్రీ వ్యాసరాయలు ఆయన తిరుపతి వచ్చి తిరుమలకు వెళ్లాలని పర్వతదర్శనం చేశారు ఆశ్చర్యం! తిరుమల కొండలన్నీ ఆయనకు సాలగ్రామశిలగా గోచరించాయి అంతే తీర్థులవారు తిరుమలకు మోకాళ్లపై పాకి వెళ్లారు పాదస్పర్శ తగలనీయలేదు సాలగ్రామరూపి సాక్షాత్ శ్రీమహావిష్ణువు కదా! మరి ఎలా పాదాలతో స్పృశించడం?

తిరుమల పవిత్రత ఇంకొంచెం ప్రాచీనకాలంలో అంటే - 12, 13 శతాబ్దాలలో - తిరుమల పర్వతాలన్నీ శేషస్వరూపమని, కాళ్లతో తొక్కకూడదని అనుకునే వాళ్లు తిరుమలకొండపైన ఏ కొందరో జియ్యరులు, వాళ్ల అనుచరులు, అర్చకులు ఉండేవాళ్లేకాని, ఇతరులెవరూ ఉండేవాళ్లుకాదు ఆ ఉన్నవాళ్లయినా స్వామికి నివేదన చేసిన ప్రసాదం తిని ఉండాలే కాని వంటలు చేసి, సంసారాలు పెట్టేవాళ్లు కాదు అదే యిప్పుడు కొన్నివేలమంది నిత్యనివాసం ఏర్పాటుచేసుకొని స్వామి సేవకంటే ఆసాముల సేవను సాగిస్తున్నారు ఇది, అది అని ఏమిటి- సకలకళలు అక్కడ తాండవం చేస్తున్నాయి ఆనాటి విలువలను పట్టించుకునే వాళ్ల సంఖ్య మృగ్యమై పోయింది

శ్రీరామానుజులు విశిష్టాద్వైతమత ప్రవర్తకులు, శ్రీవైష్ణవ ధర్మ ప్రచారకులు అయిన శ్రీరామానుజాచార్యులవారు కొండపైకి నడిచి వెళ్లడానికి ఎంతో అపచారం జరిగిపోతున్నదని బాధపడేవారట మొట్ట మొదట శ్రీరామానుజాచార్యులవారు తిరుమల సందర్శించడానికి వెళ్లి నప్పుడు శ్రీ తిరుమలనంబి మోకాళ్ళపర్వతం వరకు దిగివచ్చి ఆయనకు స్వాగతం పలికారు ఆ తరువాత తిరుమలనంబి సన్నిధిలో ఆ ప్రదేశం లోనే రామానుజులు రామాయణరహస్యాలను తెలుసుకుంటుండేవారు ఇప్పడక్కడ చిన్నమండపం, ఒక ఆలయంకూడా ఉన్నాయి దాన్ని శ్రీరామానుజాచార్యులవారి ఆలయంగా చెపుతారు శ్రీ ఆచార్యు లవారే తిరుమల పవిత్రతను కాపాడటానికి కొండపైన ఎవరెవరు తప్పక నివసించాలో వారినే అక్కడ ఉండమని అనుమతించారని చెపు తారు స్వామి పుష్కరిణికి చుట్టూ ఒక చదరపుయోజనపర్యంతం గల ప్రదేశం చాలా పావనమైందని, ఎందరో యోగులు తపస్సుచేసిన పుణ్యక్షేత్రమని ఇతిహాసం చెపుతున్నది ఘట్టిగ యాదవరాయలద్వారా శ్రీరామానుజాచార్యులవారు తిరుమల అభివృద్ధికి ఎంతో కృషిచేశారు

**అందరికీ అందుబాటులో** కాలం మారింది సౌకర్యాలు పెరిగేకొద్దీ సంప్రదాయాల విలువలు మారిపోయాయి ఈనాడు కాలిబాటన నడిచే యాత్రికులకు కూడా అనేకానేకసౌకర్యాలను సమకూరుస్తున్నది యాజమాన్యం మా గురువరేణ్యులు, 'మహోపాధ్యాయ', 'కళాప్ర పూర్ణ' శ్రీమాన్ ఎస్ టి జి వరదాచార్యులవారు 'సువర్ణపుష్పమాల' లో అన్నట్లు స్త్రీలు, చిన్నపిల్లలు, వృద్ధులు, దుఃఖితులు పాపం, ఒక్కొక్క మెట్టే ఎక్కి ఎంతో కష్టపడి వస్తున్నారని జాలిపడి ఘాట్ రో డ్ మీద బస్సులలో వచ్చి తన దర్శనం చేసుకోవడానికి వీలు కల్పించి 'భగవంతుడు సర్వసులభుడ'నే మాటను మరొక్కసారి నిజంచేశాడు నిఖిల నిగమవేద్యుడు మన వేంకటేశ్వరుడు

**భూలోక వైకుంఠం** ఎన్నెన్ని సౌకర్యాలు ఏర్పడ్డా పచ్చని వస్త్రాలతో, పెంచిన గడ్డాలతో, కట్టిన ముడుపులతో ఎలుగెత్తి 'అడుగడుగు దండా లవాడా! ఆపదమొక్కులవాడా! గోవిందా! గోవిందా!' అని పిలుస్తూ పర్వతశ్రేణులను అధిరోహించే భక్తబృందాలు ఒకవైపు, ఆత్మాభిమా నరాహిత్యానికి నిదర్శనంగా తలనీలాలను సమర్పించి, గృహాభిముఖంగా

దిగివస్తున్న భక్తులు ఇంకోవైపు నడుస్తుంటే నిజంగా అదొక భూలోక వైకుంఠమార్గమని అనిపించక తప్పదు అందుకే మా గురువర్యులు శ్రీవరదాచార్యులవారిలా అంటారు—

సంకీర్తయన్నో౽మలనామ నిత్యం
యద్ధామ్ని కుర్వన్తి పరస్సహస్రాః,
ఆరోహణం చాప్యవరోహణం చ
శ్రీవేంకటేశం తమహం ప్రపద్యే

# 3. విగ్రహారాధకులు మందబుద్ధులా?

జీవకోటికి సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలున్నాయి అందులో కొంతమందికి కొన్ని అధికశాతంలో ఉంటాయి ఈ మూడింటిలో మొదటి రెంటికంటే మూడవది చాల ప్రమాదకరమైనది దాని ప్రభావంచేతనే కొందరు 'ఒకరు చెప్పిందానిలో సత్యమేమిటని ఆలోచించే శక్తిని కోల్పోతారు అంతేకాక అవ్యవస్థితమైన చిత్రప్రవృత్తిలో ఇతరులకంటే నేను గొప్పవాణ్ణనిపించుకోవాలని వీరు ఎల్లప్పుడు ప్రయత్నం చేస్తుంటారు దానికోసం పాపం చాలా చాలా అవస్థలు పడుతుంటాడు ఈ రకం మానవుడు అది సహజం అయితే అందులో తరతమభేదాలు కోకొల్లలుగా ఉన్నాయి

ఇటువంటివారిలో కొందరే ఈ కోవకు చెందినవారు పాప మేమిటంటే వారికి నిజం తెలియదు ఆలోచించే మనస్తత్త్వాన్ని భగవంతు డివ్వలేదు కాని ప్రతిష్ఠ రావాలి మరి ఏమిటి చేయటం? ఏదో ఒకటి

చేయకపోతే ఎలా పేరొస్తుంది? కుండలైనా పగలగొట్టితే, గుడ్డలైనా చించితే, గాడిదరుపైనా అరుస్తే, ఎవరైనా మనల్ని గమనించకపోతారా? అనే మాదిరిది వారి ప్రయత్నం నిజమే, అలాంటివారి ఆవేదన, ఆశాభావం ఈ సమాజంలో చాలా తొందరగా ఫలవంతమౌతుంది ఎందుకని? మనలో గొఱ్ఱె మనస్తత్వంవాలాలు కొల్లలుగా ఉన్నారు కాబట్టి నోళ్లుగల మూగవాళ్లకు కొరతలేదు కాబట్టి, ఈ మాదిరి తత్త్వం గల సమాజాల్లోనే ఈ ఆముదపుచెట్లు పుట్టి, పెరిగి తమని మహావృక్షాల మనుకుంటూ అలా అందరినీ అనమని చేతనైనంతవరకు నిర్బంధం చేస్తుంటాయి కనుచూపుమేరలో నిజమైన గంధపు చెట్టు వాసన తగిలితే దాన్ని సమూలనాశనం చేస్తేనే గాని తన ఆముదంకంపులోని ఇంపుతో అందరు ముదం పొందరని ఆ పెద్దమనుష్యుల భావన ఒప్పుకుందామా? ఒప్పుకొనేవారు లేరని మాత్రం ఇంకా అనుకోలేము పై మాదిరి వారిలో కొందరీ క్రింది విధంగా ప్రశ్నిస్తారు

అసలు దేవుడున్నాడా? ఉంటే ఈ బొమ్మలతో పూజ చేయమన్నాడా? ఇంకా గూడ చాలా ప్రశ్న లున్నాయనుకోండి కాని ఈ సమస్యకు ముందు సమాధానం దొరుకుతుందేమో మన మెదడుకు కాస్త మేత వేసి చూద్దాం

ప్రపంచంలో చాలా పదార్థాలున్నాయి వాటిని మనం తెలుసుకోవటానికి మన శరీరంలో చాలా యంత్రా లున్నాయి వాటికి శక్తి తక్కువ కాని వాటి శక్తి ఉన్నంతవరకు మనకు జ్ఞానాన్ని కలిగిస్తూ ఉంటాయి ఆ యంత్రాలనే పంచేంద్రియా లంటారు కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము వీటికి ఉపమానాలు చెప్పాలంటే లోకంలో దొరకవు కాని కొంచెం దగ్గరలో ఉండే వస్తువుల్ని చూద్దాం కెమేరా ఇది కంటికి కొంచెం దగ్గఱలో ఉంటుంది సామాన్యపు కెమేరా కంటే కంటికున్న శక్తి చాలా హెచ్చు ప్రతి వస్తువును చూచిన వెంటనే ఫోటో తీసి హృదయానికి ఒక నిముషంలో కాపీల నందించి సంతోషాన్నో, దుఃఖాన్నో కలిగిస్తుంది ఇది గొప్ప ఆటోమేటిక్ కెమేరా ముక్కు - సువాసన, దుర్వాసన వీటిని కనిపెట్టే యంత్రం చెవి శబ్దాన్ని అలాగే (Tape Record) గ్రహించే యంత్రం నాలుక రుచిని ఉన్నది ఉన్నట్టు తెలియజేసే యంత్రం చర్మము స్పర్శను తెలియజేసే యంత్రం ఈ భావముతో మనం ఆలోచిస్తే మన పంచేంద్రియాలకంటే ఈ యంత్రాలు చాలా శక్తి తక్కువవి వీటిలో ఉన్నతమైన యంత్రాలను ఇప్పుడు కనిపెట్టి

గ్రహాంతరాళాలలో ఫోటొలను తీస్తున్నారు శబ్దాలను వింటున్నారు ఇంకెన్నో చేస్తున్నారు అవి కన్ను మొదలగు వాటి కంటే శక్తి గలవి కావచ్చు కాని వాటికి కూడా శక్తి తక్కువే అని చెప్పక తప్పదు ఈ ఇంద్రియాల వల్ల కలిగే జ్ఞానాన్ని ప్రత్యక్షమంటారు సహేతుకంగా ఊహించే దాన్ని అనుమానమంటారు మనకు నమ్మకము గలవారి మాటవల్ల మనకు కలిగే జ్ఞానాన్ని శబ్దజ్ఞాన మంటారు మనం ముఖ్యంగా పై మూడు ప్రమాణాలనీ ఒప్పుకోకపోతే లోకంలో మనం బ్రతకటం కష్టం ఇప్పుడు పై ప్రశ్నలడిగేవారిని మనమొక ప్రశ్న అడుగుదాం కంటికంటే శక్తిగల యంత్రాలు గ్రహాంతరాళాలలోని ఫోటోలని మనకు అందిస్తున్నాయికదా? వాటికి దేవుణ్ణి ఫోటో తీసేశక్తి లేదెందుకని? సమాధానం వాటి శక్తి దేవుణ్ణి గ్రహించటానికి చాలింది కాదు కాబట్టి వాటి శక్తే చాలకపోతే కంటి శక్తి ఎలా చాలుతుందండి? రాత్రిపూట కొవ్వొత్తి వెలిగించి Flash లేని కెమేరాతో ఫోటో తీస్తే బొమ్మ బాగా పడుతుందాండి? మరి పడటంలేదు కాబట్టి ఫోటో తీయించుకోటానికి కూర్చున్న వ్యక్తి లేడంటామా? అలాగే దేవుని ప్రత్యక్షం కలగటానికి ప్రస్తుతము మనకున్న సాధనాలు చాలవు మన యంత్రాలలో లోపాలుంటే కనపడకపోవటంలో దేవునిది తప్పా? గుడ్డివాడికి శిల్పసౌందర్యం కనపడకపోతే అది శిల్పం తప్పంటే చెల్లుతుందాండీ? అంతకంటే అన్యాయం ఏముందండి? ఇంకొక ప్రశ్న? వెన్నపూసను - నూనెను చూచే ఉంటారు కుండెడు పాలను చూపించి వెన్న దీనిలో ఉందా? అంటే లేదని చెబుతారా? ఉంటే అప్పుడే ఎందుకు చూపించలేదు? అలాగే చాటెడు నువ్వులను చూపించి నూనె వాటిల్లో ఉందా? లేదా? అంటే ఏమి చెబుతారు? ఉందంటే వెంటనే చూపించాలి కాని లేదని చెప్పటానికి వీలులేదు

అయితే ఊహించి చెబుతారు వాటిలోపల ఉంటుందండీ, కొంత ప్రయత్నం చేస్తే కనబడుతుందని అదే అనుమానప్రమాణం

మరొక ప్రశ్న మన తండ్రిని మనం మొదట ఎలా చూచామండీ? తల్లి చెప్పితేగదా? ఈ వ్యక్తి మన తండ్రి అని తల్లిమాట లేకుండా ప్రత్యక్షంగా మనం పుడుతున్నప్పుడే చూడగలమా? చూడలేము అయితే తల్లిమాట మీద విశ్వాసము ఉంచుతాము మరి వేదమాత చెబుతుంటే భగవంతుణ్ణి తండ్రిమాదిరిగా అంగీకరించ మిదేం కర్మమండీ! ఇదే శబ్ద ప్రమాణం

రేజీకటి గలవాడిని మనం చూస్తే కనులు బాగున్నట్టే ఉంటాయి కాని ఏం ప్రయోజనం? ఎంతమంది చెబుతున్నా ఎన్ని దీపాలు వెలుగు తున్నా వాడికేమీ స్పష్టంగా కనపడదు అలాగే నల్గురు శ్రుతిమాతలు నెత్తి నోరు కొట్టుకొని ఘోషిస్తున్నా, ఎన్ని స్మృతిదీపాలు వెలుగు చున్నా మనకళ్ళకు కనబడేది అంధకారబంధురం, మోహమయమైన ఈ ప్రపంచమే పాపఫలం బాగా ముదిరి పండితే కాని నేల రాలదు మధుపానమత్తుడు మంచిమాటలతో పలకరిస్తే కరవొస్తాడు అశ్లీలంగా మాట్లాడతాడు కొంచెం ఘాటుగా సూటిగా ప్రవర్తిస్తేనే కాని దారికి రాడు "శఠే శాఠ్యం సమాచరేత్" అని ఊరికే ఎందుకండి చెపుతారు?

కాబట్టి ప్రతిక్షణంలోను, ప్రతి అణువులోను, ప్రతి కదలికలోను భగవంతుడు మనకు సన్నిహితుడుగా ఉన్నాడు తెలుసుకోవటానికి కావాలి కొంచెం సంస్కారం, లోకానుభవం కూడా

దేవుడున్నాడు కాబట్టి ఆరాధన చేయవచ్చునేమో? గాని బొమ్మల పూజేమిటండీ? అంటారు అంతేకాదు ఈ విగ్రహారాధన చేసే వారు మందబుద్ధులని కవిత్వాలు కూడా వ్రాసేశారు 'ప్రతిమా మందబుద్ధీనామ్' అని

అంటే మందబుద్ధులకు ప్రతిమలతో ఆరాధనమని వారి అభిప్రాయము కాని వారి కవిత్వమే వారి వేలితోనే వారి కన్ను పొడుచుకున్నట్లు తయారైంది 'ప్రతిమా అమందబుద్ధీనామ్' అని మూర్ఖులు కాని వారికే విగ్రహారాధనమని తేలింది అది సంస్కృతభాషలోని వైశిష్ట్యం ప్రతిమా అన్న పదం తరువాత మందబుద్ధీనాం అన్న పదం ముందు 'ఽ' అని ఒక అకారప్రశ్లేషం వేస్తే విరుద్ధార్థాన్నిస్తుంది చదివేటప్పుడు పెద్దగా తేడా రాదు

ఆకారంలేని దేవునికి ఆకారాన్ని కల్పించటమేమిటనీ, రాళ్లను, చెట్లను పూజించటమేమిటనీ వారి అభియోగాలు

సగుణోపాసన (రూపాదులు గల ఆరాధనము) చేయనివానికి నిర్గుణోపాసన (రూపాదిరహితారాధన)లో దృఢనిశ్చయసమాధిస్థితి కలుగదు కాబట్టి సాకారుడగు భగవంతుని ఆరాధింపమని వేదాలు - ఆగమాలు - ధర్మశాస్త్రాలు - పెద్దలు ఉపదేశిస్తున్నారు అది యుక్తంగానే తోస్తుంది పెండ్లయిన తరువాత వరునికి పురోహితుడు అరుంధతీ నక్షత్రాన్ని చూపిస్తే దాన్ని చూచే ఓపిక లేక, అయ్యా! అరుంధతీ నక్షత్రంకంటే నాకు ఆరువేల అప్పు బాగా కనబడుతున్నదన్నట్లు,

కళ్లు మూసుకుని నిర్మలాంతఃకరణంతో యోగసమాధిలో భగవంతుని ధ్యానించమంటే ఎంతమంది సంసారబాధలను మరచిపోయి భగవద్ధ్యానం చేయగలరో మీరే ఆలోచించండి పది నిమిషాలు ఏకాగ్రంగా కంటికి కనపడే వస్తువును చూడమంటే చూడలేని మనస్సు కళ్లు మూసుకుని నామరూపాలు లేని భగవంతుని ధ్యానించమంటే ధ్యానిస్తుందనటం గొడ్డురాలికి బిడ్డకలిగిందనటంతో సమానం అయితే ప్రపంచంలో ఎవరికీ యిది సాధ్యపడదా? అంటే, సాధ్యపడదని ఎవరంటారు? ఏడు కొండలస్వామి దగ్గరకు కొందరు తిరుపతి నుంచి మెట్లు ఎక్కి నడిచి వెడతారు కొందరు టి టి డి వారి బస్సుల్లో వెడతారు కొందరు చంద్రగిరివైపు మెట్లెక్కి వెడతారు అయితే వ్యయప్రయాసలలో తేడా లేదు అంటరికీ సమానంగానే స్వామి దివ్యమంగళవిగ్రహం కనబడుతుంది ఓపిక, ఓర్పు, సమర్థత అవసరం ఎప్పుడూ ఒక పని సాధించటానికి పది ఉపాయాలుంటే తేలికైనది వాటిలో ఒకటే వుంటుంది అందువల్లనే భగవదుపాసనాన్ని గురించి ప్రాచీనభారతీయతాత్త్వికులలో విభిన్నదృక్పథాలు మనకు గోచరిస్తాయి అందులో ఆరాధననుగురించి విశేషంగా లక్షణాలను చెప్పినవి ఆగమశాస్త్రాలు వాటి స్వరూపం తెలియక వేసే ప్రశ్నలు అర్థరహితాలు అయితే అవి అందరికీ అందుబాటులోకి రాకపోవడమే భారతీయులమైన మన దురదృష్టం

కనిసం సిద్ధాంతపరమైన గ్రంథాలనైనా మనం తెలుసుకొంటే మనం విభ్రాంతుల మౌతాము దానికి తగిన అవకాశాలను మన ప్రభుత్వంవారు కలిగించాలి "పొరుగింటి పుల్లకూర రుచి" అనే మనస్తత్త్వాన్ని మార్చుకోలేని మనమా ప్రాచీనభారతీయసంస్కృతికి విలువకట్టే వాళ్లం? ఎంత దౌర్భాగ్యం?

సగుణారాధనలోనే నిర్గుణారాధన కూడా అంతర్భాగంగా ఉంటుంది దానినే వారి పరిభాషలో 'మానసయాగ' మంటారు ఈ మాదిరి విషయాలను బాగా విమర్శించి ఏర్పాటు చేసిందే ఆగమశాస్త్రం టైఫాయిడ్ రోగికి పథ్యంపెట్టే రోజునే పంచభక్ష్యపరమాన్నాలు పెడితే అతను దానిని తిని హరించుకోలేక ప్రాణాలనే కోల్పోతాడు మేడపైకి ఎక్కే చిన్నపిల్లవాణ్ణి మొదటి మెట్టుమీద కెక్కకుండానే పైమెట్టు మీదికి విసిరివేస్తే క్రిందకు దొర్లిపడి దెబ్బతింటాడు అలాగే వారి వారికి తగినట్లు వారుపాయాలను నిర్ణయించుకోవాలే గాని కడుపునొ

ప్పికి, తలనొప్పికి ఒకేమందు వాడినట్లు అందరికి ఒకే మార్గమనటం మూఢవిశ్వాసం

మన హిందూమతానికి భారతీయసంస్కృతికి ప్రత్యేక మనదగిన "భగవద్గీత"లో -

" పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతం
అశ్నామి ప్రయతాత్మనః "

-అని ఆకారము లేని భగవంతు డెలాగండి ఆరగిస్తానని చెబుతున్నాడు? ఇంకా -

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః"

- అని "మద్యాజీ" అనే పదంలో నన్నారాధింపుమని దేవుడే చెబుతున్నప్పుడు మనకీ సందేహాలు కలగటం కంటే పాపమేముంటుంది?

ఇక రెండవ అభియోగం రాళ్లను, చెట్లనూ పూజించటం ఇక్కడే ఆగమశాస్త్రం ప్రముఖస్థానం వహించి తన నూతనసిద్ధాంతాలతో ప్రజానీకానికి ఆశ్చర్యం కలిగిస్తుంది భగవంతుని కొక స్వరూపాన్ని చెప్పి దానియందు మనసు లగ్నంచేసి, తద్ద్వారా మన మనస్సును పాపకృత్యాలనుండి నివర్తింపజేసి భగవద్ధ్యానంలో ప్రవేశపెట్టటానికే ఈ మార్గాన్ని మహర్షులు కనుగొన్నారు ఎవరైనా ఒక మొద్దుకు గాని, ఒక రాయికి గాని నమస్కరిస్తారా? నమస్కరించరు దానికి సుందరమైన దేవతా శిల్పంగా చెక్కితే తప్పకుండా నమస్కరిస్తారు అందుకనే భగవంతుని సాన్నిధ్యం మూడు రకాలుగా ఆగమశాస్త్రంలో ఉంటుందని యిలా చెబుతారు-

"స్థాపకస్య తపోయోగా త్పూజాయాశ్చాతిశాయనాత్,
అభిరూప్యాచ్చ బింబస్య త్రిధా సన్నిహితో హరిః" అని

స్థాపించిన వాని మహిమవలన, అచట జరుగు నిత్యారాధనావిశేషం వలన, విగ్రహసౌందర్యంవలన కూడా స్వామివిగ్రహంలో తన తేజస్సును నిలబెడతాడు పిచ్చివాడుకూడా ప్రయోజనంలేకుండా ఏ పనీ చేయడు గదండీ మన తల్లిదండ్రుల ఫోటో క్రిందపడితే దాన్ని తొక్కుతూ పోవడానికి మనం యిష్టపడతామా? దానికెందుకు పూలమాల వేసి ఎత్తున తగిలించి గౌరవిస్తాము? ఫోటో అంటే అట్టే గదా? దానిలో

తల్లి ఉందా? తండ్రి ఉన్నాడా? దానిపై ఉమ్మివేస్తే తల్లికీ తండ్రికీ అవమానమెందుకు? ఈ మాదిరి ఆలోచనచేస్తే మనకు విగ్రహారాధనలోని దైవతత్త్వం గోచరిస్తుంది

'యద్య ద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్'

అని భగవద్గీతలో చెప్పినట్లు ప్రపంచంలో ఉత్కృష్ట పదార్థాలలోని తేజస్సు భగవంతునిదే ఈ భావన మన కేర్పడితే తోటిమానవులను మన మెంత గౌరవించి శాంతిమయసహజీవనాన్ని గడపగలుగుతామో చూడండి చరాచరసృష్టి అంతా భగవన్మయం అని చెబుతూ సూర్యనమస్కారా లెందుకండి చేస్తాం? అక్కడ ఎక్కువ శక్తి ఉన్నదనే కదా? అధునాతనశాస్త్రాలు చెబుతున్నట్లు ప్రతిపదార్థం లోకంలో ప్రతిపదార్థాన్ని తన వైపు ఆకర్షిస్తుంటుంది అందుకనే మన తేజస్సు నశించకుండా ఉండటానికి పెద్దలకు నమస్కరిస్తాము

కనుక విగ్రహారాధనం చేసేవారు మూర్ఖులో, విగ్రహారాధన చేయరాదన్న వారు వంచితులైన మూర్ఖులో మీరే ఆలోచించండి భగవంతునికి మాత్రం విగ్రహారాధన వద్దు మన గురువుదో, నాయకునిదో, తల్లిదండ్రులదో విగ్రహాన్ని పెట్టి పూలమాలలతో పూజించాలి? ఇంత అన్యాయం, అక్రమం ఏదైనా ఉందా?

బాహ్యసంబంధాలనుండి మానవుని మనస్సును మరల్చటానికే దేవాలయాలు - విగ్రహారాధన ఏర్పడ్డాయి మన భారతదేశసంస్కృతి సోపానాలు దేవాలయాలు భారతీయతను పదేపదే చాటి చెప్పేదే విగ్రహారాధన ఇది నేటిది కాదు కృతయుగంలోనే ఇక్ష్వాకుమహారాజుకు శ్రీరంగనాథుడు ప్రత్యక్షమై ఆయనవద్ద తన అర్చారూపాన్ని ఉంచి అర్చన గైకొన్నట్లు, శ్రీరాముడు విభీషణునకు "ఆరాధయ జగన్నాథమిక్ష్వాకుకులదైవతమ్" అని చెప్పి యిచ్చినట్లు కావేరీప్రాంతంలో ఉంచి విభీషణుడు సంధ్యాదికములు తీర్చుకొనేసరికి స్వామి నాకిచ్చటే బాగున్నదని అచట స్థిరపడిపోయినట్లు శ్రీరంగంలో నేటికీ మనకు ప్రత్యక్షంగా కనబడుతున్న శ్రీరంగనాథుని గురించి పౌరాణికగాథలు వినబడతాయి

ఇంకా రామాయణంలో-

దేవాయతనచైత్యేషు సాన్నభక్షాః సదక్షిణాః,
ఉపస్థాపయితవ్యాః స్యుః మాల్యయోగ్యాః పృథక్ పృథక్ ||
అయో 3 18

కొల్లలుగా దేవాలయాల ప్రశంసలు చేసిన స్థలాలు కనబడుతున్నాయి
కనుక అనాదినుంచి పరమోపాయంగా భారతదేశసంస్కృతికి ప్రతీక
భూతమైన విగ్రహారాధన మనకందరకు ఐహికాముష్మికసాధన మనటంలో
కొంచెమైనా సందేహం లేదు

# 4. నదీతీరాల్లో దేవాలయాలు

## పరిచయం

తన చుట్టూ ఉన్న ప్రకృతిలో ప్రతిఅణువులోను పరమాత్మను తాను సందర్శించి ఇతరులకు చూపెట్టగల ప్రహ్లాదుడు లాంటి మహాభక్తు లుద్భవించిన సంస్కృతి మన హిందూసంస్కృతి ఏకాగ్రతకు, తాదాత్మ్యభావనకు, నిస్స్వార్థమైన ప్రేమకు, భక్తినిష్ఠకు, ప్రథమోదాహరణంగా ప్రపంచంలో ఒక దేశాన్ని పేర్కొనాలంటే, ముందు చెప్పదగింది భారత దేశం దానికి కారణం ఆర్షసంస్కృతిద్వారా హిందూధార్మికసిద్ధాంతాలపై మనకు సంక్రమించిన జీవనవిధానం ఎక్కడో ఒకచోట, వారానికి ఎప్పుడో ఒకసారి పాపాలకు భయపడి ప్రభూ! అని ప్రార్థించమని చెప్పదు హిందూధర్మం తన హృదయాకాశంలో అంతరాత్మగా వుండి, తన శరీరంలో, మాటలో, మనసులో కలిగే ప్రతిసంచలనానికి, అన్నికర్మలకు కారణభూతుడై చరాచరజగన్నాథుడైన భగవంతుడికోసమే తను జీవించి,

ఆయన అనుగ్రహించిన సకలవైభవాలతో జీవితాన్ని తులసీదళంగా ఆయన పాదాలముందు అర్పించమని చెబుతుంది హిందూధర్మం ఈ భావన హృదయంలో నాటుకొన్న హిందువులకు ప్రకృతి అంతా భగవన్మయంగా గోచరించడంలో ఆశ్చర్యం లేదు భగవన్మయమైన ప్రకృతిలో పవిత్రతాభావన కలగడం సహజం లోకంలో సహజమైన పవిత్రత కలిగినది జలం కాబట్టి దానిని 'జీవన' మంటారు అక్కడక్కడా ఏర్పడ్డ జలభాగాలకే నదులని పేరు ఈ నదులన్నీ ఎక్కడెక్కడో తిరిగి, కొన్నిచోట్ల పెరిగి, కొన్ని చోట్ల తరిగి చిట్టచివరకు సముద్రంలో కలుస్తాయి చిత్రవిచిత్రమైన నదుల చరిత్ర పరిశీలిస్తే దాని వెనుక మానవజాతికి ఒక గొప్ప సందేశం ఉందేమో! అనిపిస్తుంది అలాంటి నదీతీరాల్లో దివ్యత్వం ఉట్టిపడే దేవాలయాలుండటంలో ఎంతో ఔచిత్యం ఉంది

దేవాలయాలంటే సర్వాంతర్యామియైన భగవంతుణ్ణి కంటి ఎదుట నిలుపుకొని, బాహ్యప్రపంచంలోని ప్రలోభనాలకు తాను గురికాకుండా ఆయన్నే సేవిస్తూ, ధ్యానిస్తూ, స్మరిస్తూ ఉండాలంటే, ఆయన కొక స్థిరమైన మందిరం కావాలి దాన్నే మనం దేవాలయం అంటాం అంటే దేవుడుండే చోటు ఇక్కడ "మిగతా చోట్ల లేడా?" అని కువ్యాఖ్యానం చేసుకోకూడదు విద్యుచ్ఛక్తి అంతట ఉన్నా, బల్బు, రేడియో, ఫాన్ మొ చోట్ల దాని ప్రభావం మనకు కనబడినట్లు, ఆవు పొదుగులోనే పాలు పిండుతున్నట్లు, తేజఃకిరణాలు అంతట ఉన్నా అగ్గిపుల్లద్వారానే నిప్పుపుట్టినట్లు, సర్వాంతర్యామిగా ఉన్న భగవంతుని సాన్నిధ్యం ఎక్కువగా ఒకచోట కలగడానికి మహర్షులు కనుక్కొన్న నూతనప్రక్రియే ఈ దేవాలయం

నదీతీరాల్లో నదీతీరాలకు దేవాలయాలకు ఏమిటి సంబంధం? చాలా దగ్గర సంబంధం ఉంది ఇది ఆగమశాస్త్రాల్లో స్పష్టంగా వివరించబడింది దేవాలయాన్నే దేవస్థానం అంటారు ఈ స్థానాలు రెండు రకాలు, సిద్ధమని అసిద్ధమని

1 సిద్ధస్థానం కొండలపైన, కొండలకింద, నదీతీరంలోను, సముద్ర సంగమంలోను, సముద్రతీరంలోను, మడుగులదగ్గఱ, పుణ్యప్రదేశంలోను, అడవిలోను, దేవతలచే స్థాపింపబడి, భగవత్సాన్నిధ్యం ఉండే స్థానాన్ని సిద్ధస్థానం అంటారు

2 అసిద్ధస్థానం గ్రామనగరాదులు కట్టుకోవడానికి ముందు నిర్దిష్టమైన ప్రదేశంలో మానవులు నిర్మించిన స్థానాన్ని అసిద్ధస్థానం అంటారు

ఇందులో నదితీరం సిద్ధస్థానం కాబట్టి నదుల్లో, పర్వతాల్లో, స్నానాది విధులను ఆచరించిన భక్తులు సేవించడానికి ఉపయోగపడేట్టు నదీతీరాల్లో దేవాలయనిర్మాణం చేశారు ఈ విషయమే పాద్మసంహిత అనే ఆగమశాస్త్రంలో ఇలా వివరింపబడి ఉంది-

మూలే మూర్ధని శైలానాం నద్యాః తీరే చ సంగమే,
సముద్రతీరే పులినే హ్రదే తీర్థే చ కాననే,
ఏతేషు నిర్మితం స్థానం సిద్ధాఖ్యం విశ్వకర్మణా,
దేవాదిభి రహం తత్ర స్థాపిత శ్చే ద్యథావిధి

మనుష్యై ర్నిర్మితం స్థానం నగరాదికృతం మమ,
అసిద్ధాయతనం విద్ధి గ్రామాదిస్థితిహేతుకమ్

ఇంకా ఆగమశాస్త్రాలు దేవాలయనిర్మాణానికి తగిన భూమిని 'సుపద్మ', 'భద్రక', 'పూర్ణ', 'ధూమ్ర' అని నాలుగువిధాలుగా విభాగం చేస్తున్నాయి అందులో నదీతీరంలో ఉండే భూమి 'భద్రక' అనే విభాగానికి చెందుతుంది ఈ విషయం ఇలా వివరింపబడింది

నదీసాగరపార్శ్వస్థా తీర్థాయతన మాశ్రితా'
భద్రకా చేతి సా స్మృతా

ఇలా జలప్రవాహప్రాంతంలో ఉన్న భూమి దేవాలయనిర్మాణానికి యోగ్యమైనదిగా, భౌగోళికంగా నిర్ణయించినట్లు కనబడుతుంది

మనకు దైనందినకార్యక్రమాలు స్నానంతో ప్రారంభమౌతాయి ఆ స్నానాలు ఎన్నోరకాలు అందులో అవగాహనస్నానం (నీటిలో దిగి, మునిగి స్నానం చేయడం) చాలా శ్రేష్ఠమైనది దేవసందర్శనానికి వెళ్లేటప్పుడు శుచిగా, శుభ్రంగా వెళ్లాలి కాబట్టి నదీతీరాల్లో లేని దేవాలయాల్లో కూడా ప్రాచీనకాలంలో పుష్కరిణి నిర్మింపబడేది నదీతీరాల్లో పూర్వం మహర్షులు ఆశ్రమాలు నిర్మించుకొని త్రిసంధ్యలను ఉపాసిస్తూ, అర్ఘ్యాదులు సమర్పిస్తూ, ప్రశాంతమైన వాతావరణంలో వారి జీవితాలు గడిపేవారు మహాతపస్సంపన్నులైనవారు నిత్యం ఉపయోగించిన జలాలు కావడంచేత, సహజంగా పవిత్రమైన ఆ యా నదీజలాలు ఇంకా పరమపవిత్రా లయినాయి వాటికే తీర్థాలని కూడా ప్రసిద్ధి లభించినది తీర్థం అంటే పుణ్యమని, పుణ్యోదకం, పవిత్రోదకం అని

కూడా అర్థం ఈ తీర్థాలను సందర్శించినా, అందులో స్నానం చేసినా ఎన్నో జన్మల పాపాలు తీరిపోతాయని, తమ పితృదేవతలు కూడా తరిస్తారని హిందువుల విశ్వాసం ఈ భావనతో ముడివేసుకున్నదే తీర్థయాత్రాభావన తీర్థయాత్రలకు హిందూజీవనంలో ఉన్న పవిత్రత ఇతరచోట్ల కనబడదు తీర్థయాత్రకు వెళ్లి పవిత్రనదీజలాలలో అవగాహనం చేసి, పితృదేవతలు తరించడానికి ఎన్నో విధులను ఆచరించి, ఆ ప్రదేశంలో ఉన్న స్వామిని సేవించడం హిందూజీవనంలో గొప్ప అదృష్టంగా భావింపబడుతున్నది ఇది ఈనాటిది కాదు కృతయుగం నుంచి వస్తున్న సంప్రదాయం యుగయుగాల్లోను అవిచ్ఛిన్నంగా మానవజాతి అనుసరిస్తున్న మహోజ్జ్వలమార్గం

ప్రాకృతికంగా కూడా నదీతీరంలో దేవాలయం నిర్మించడానికి అవకాశం పుష్కలంగా ఉంటుంది భౌతికశాస్త్రాల ననుసరించి కూడా నది ప్రవహించే ప్రాంతంలో ప్రజల బుద్ధిబలం, ఆరోగ్యం, ఆలోచనా విధానం విశిష్టమైనవి అందులో ఆగమశాస్త్రాలలో చెప్పినట్లు సరైన దిక్కులో జలం ప్రవహిస్తూ ఉంటే, దాని గట్టు రమణీయమైన వృక్ష లతాగుల్మాదులతో కళకళలాడుతూ, ఎన్నో పూలతోటలు, పండ్లతోటలు గుబాళిస్తుంటే, అక్కడ సాక్షాత్తు భగవంతుడు అందమైన మందిరంలో వేంచేసి ఉంటే, వేదపారాయణలు, నామభజనలు, హరికథాకాలక్షేపాలు, ఎన్నెన్నో కార్యక్రమాలు అక్కడ జరుగుతూ ఉంటే, అంతకంటే నిజంగా మానవుడికి శాంతి ఎక్కడ లభిస్తుంది? ఈ భావాన్నే నేను దేవాలయమనే నా కావ్యంలో ఇలా వ్రాశాను-

**సంసారభీతస్య పలాయితస్య**
**కామాదిదోషైః కవిలాసభూమేః,**
**చిత్తస్య శాన్తిస్సులభా హి యత్ర**
**దేవాలయం తం సుధియో భజన్తు**

కాబట్టి ఈ సంసారంలో ఉన్న బంధాలను అన్నింటిని తెంచుకొని, కన్యాకుమారినుంచి కాశ్మీరువరకు ఉన్న ఎన్నో తీర్థాలను క్షేత్రాలను పవిత్రస్థలాలను తన జీవితంలో కనీసం ఒక్కసారైనా సందర్శించాలని ప్రతి హిందూహృదయం ఉవ్విళ్లూరుతుంటుంది

ఇంతకుపూర్వం అన్నాను - నదుల సుదీర్ఘప్రయాణం, చరిత్ర మనకేదో సందేశాన్ని అందిస్తున్నట్లున్నదని అవును, అది ముమ్మాటికీ నిజం నదులు ఎలా పుట్టాయి సముద్రంలోనుంచి? మానవుడెలా

పుట్టాడు భగవంతుడిలోనుంచి? "మమైవాంశో జీవలోకః" అనిగదా! భగవంతుడి గానం నదులెక్కడో పుట్టి ఎన్నో కొండలు, కోనలు దాటి వంకరలు తిరిగి, భూమిలోని, రత్నాలను, రాళ్లను కూడా తీసుకొని చిట్టచివరకు సముద్రంలో కలుస్తాయి సముద్రం వాటికి భర్త మఱి జీవులూ అంతే ఎప్పుడు పుట్టి, ఎన్ని కర్మలు చేసి, పుణ్యం పాపం సంపాదించి ఒకప్పుడు మంచి జన్మ ఎత్తి, ఒకప్పుడు నీచజన్మ ఎత్తి, మొత్తంమీద చిట్టచివరకు భగవంతుని సన్నిధిలో చేరతారు నదిలో నీరు, చూస్తూ ఉండగానే అంత దూరం పారిపోతుంది మానవుడి జీవితం కూడా చూస్తూ ఉండగానే ఎంతో గడచిపోతుంది కాబట్టి మాలాగానే మీ జీవితాలూ శాశ్వతాలుకాదు మేము మా భర్తయైన సముద్రుణ్ణి త్వరత్వరగా చేరినట్లు మీరు కూడా మంచి మార్గంలో నడచి, పరమాత్మను చేరండి! అంటూన్నాయి మనలను చూచి నదులు

**నదీతీరాల్లో దేవాలయాలు** మనదేశంలో ప్రసిద్ధమైన ప్రతినది ఒడ్డుపొడుగునా ఎన్నో పుణ్యక్షేత్రా లున్నాయి ఉదాహరణకు చూడండి 1 కావేరీనదీ తీరంలో ప్రసిద్ధమైన శ్రీరంగం ఉంది 2 యమునానదీ తీరంలో మధుర ఉంది 3 గంగానది తీరంలో ఎన్నో పుణ్యక్షేత్రాలున్నాయి కాశీవిశ్వేశ్వరుడు, అన్నపూర్ణలు అక్కడ వేంచేసి ఉన్నారు

మన ఆంధ్రప్రదేశం తీసుకుంటే, 4 పవిత్ర గోదావరీ తీరంలో భద్రాచలంపైన శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణులతొ వేంచేసి ఉన్నాడు 5 కృష్ణానది పాతాళగంగగా ప్రవహిస్తున్నది శ్రీశైలంలో అక్కడ భ్రమరాంబతో శ్రీమల్లికార్జునుడు నెలకొన్నాడు 6 పంపానదీ తీరంలో అన్నవరంలో శ్రీవీరవెంకటసత్యనారాయణస్వామి ఉన్నాడు 7 కృష్ణానదీతీరంలోనే వేదాద్రిలో శ్రీయోగానంద లక్ష్మీనరసింహస్వామి కొలువై ఉన్నారు 8 విజయవాడలో కృష్ణానది ప్రక్కనే శ్రీకనకదుర్గ వేంచేసి ఉన్నది 9 కృష్ణాతీరంలోనే అమరావతిలో అమరేశ్వరుడు, 10 చంద్రవంకనదికి దక్షిణాన మాచెర్లలో శ్రీచెన్నకేశవుడు వేంచేసి ఉన్నాడు 11 పెన్నానది ఒడ్డున నెల్లూరులో శ్రీరంగనాయకస్వామి, 12 స్వర్ణముఖిప్రక్కనే శ్రీకాళహస్తిలో శ్రీకాళహస్తీశ్వరుడు నెలకొని వున్నాడు 13 కృష్ణానదీతీరంలో మోపిదేవిలో సుబ్రహ్మణ్యేశ్వరుడు, కృష్ణాసాగరసంగమస్థానంలో హంసలదీవిలో శ్రీవేణుగోపాలస్వామి వేంచే

సియున్నాడు

ఇవి ఉదాహరణకు మాత్రమే ఒక నదీప్రవాహాన్ని తీసుకుంటే దాని పొడువునా అసంఖ్యాకాలైన పుణ్యక్షేత్రాలు వెలసి, ఎన్నో పేరులతో అక్కడ, స్వామిభక్తులకు సాన్నిధ్యం ఇస్తూ వారి అభీష్టాలను నెరవేరుస్తున్నాడు

మొత్తంమీద అగమశాస్త్రాలు, భౌగోళికసత్యాలు, మానవుడి మన స్తత్వం, వీటన్నింటిని జాగ్రత్తగా పరిశీలిస్తే నదీతీరాలలో దేవాలయ నిర్మాణానికి, ప్రత్యేకమైన భావన ఉందనీ, అలాంటి ఆలోచన మనవారి కేర్పడటంలో ఔచిత్యం లేకపోలేదని అనిపిస్తుంది

మన ధర్మంలో ఈనాడు ఆదరం తగ్గినట్లు కనబడినా ప్రతి సంప్రదాయం ఆనాడు ఎంతో ఆలోచనతో, అనుభవంతో, పరిశీలనతో విశాలదృక్పథంతో, వారు ఏర్పాటుచేసినదేనని, ప్రతివ్యక్తి స్వానుభవంలో గ్రహిస్తున్నాడు భౌతికదృక్పథంతో పాశ్చాత్యవాసనలతో దాన్ని చూస్తే, అనుకూలంగా ఎలా కనబడుతుంది? కాలప్రవాహాన్ని ఎవరు దాటలేరు కదా! అయినా నాలుకకు చేదుగా అనిపించినా మందు మనకు మంచినే కలుగజేస్తుంది "శ్రేయా స్వధర్మో విగుణః" అనే కదా! గీతోపదేశం

# 5. భగవద్గీత - భవ్యోపదేశం

జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సులనే ఆరుగుణాలను షాడ్గుణ్యం అంటారు ఈ ఆరు గుణాలు పరిపూర్ణంగా భగవంతునిలో మాత్రమే ఉంటాయి జగత్తులను సృష్టించడం, పోషించడం, లయింప జేయడం ఆయనకు లీలలు ఈ దృశ్యప్రపంచ మంతా ఆయన విభూతిలో నాలుగో వంతు మాత్రమే మనకు తెలియని త్రిపాద్విభూతి ఆ త్రివిక్రమునికి ఇంకెంతో ఉంది వాచామగోచరుడు బహుజన్మతపఃఫలదర్శనీయుడు అయిన ఆ స్వామి సాధుపరిత్రాణం కోసం, అసాధుపరిమార్జనం కోసం, ధర్మసంస్థాపనం కోసం అవసరమైనప్పుడల్లా అనేకరూపాల్లో అవతరిస్తూనే ఉంటాడు

ఆయన ఒకప్పుడు త్రేతాయుగంలో సత్యధర్మవ్యవస్థాపన కోసం శ్రీరామచంద్రుడై, ఇంకొకప్పుడు ద్వాపరయుగంలో శాంతిప్రేమలను చాటి చెప్పడానికి శ్రీకృష్ణుడై, ఇప్పుడు ఈ కలియుగంలో సత్యధర్మ

శాంతిప్రేమలను దిగ్దిగంతాలకు వ్యాపింపజేయడానికి, వేదధర్మాన్ని పరిరక్షించడానికి దివ్యావతారి భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగా అవతరించాడు ద్వాపరంలో శ్రీకృష్ణుడుగా అవతరించిన భగవాన్ ఆత్మ తత్త్వాన్ని, సాధనమార్గాలను భగవద్గీతద్వారా అందటికీ ఆనందంగా అందించాడు అదే ఆ అవతారానికి విశిష్టమైన ప్రయోజనం భగవంతుని చేత గానం చేయబడింది కాబట్టి ఇది 'భగవద్గీత' అయింది

ఉపనిషత్తుల్లో నిగూఢంగా నిలీనమైయున్న తత్త్వాలను, అర్జునుణ్ణి వ్యాజంగా పెట్టుకొని కురుక్షేత్రయుద్ధరంగంలో బుద్ధిమంతులు చక్కగా గ్రహించడానికి వీలుగా భగవాన్ ఉపదేశించారు ఈనాటి సమాజంలో జీవనయుద్ధరంగంలో దిగి పల్టీలు కొడుతున్న ప్రతివాడికి, వాడెదుర్కొంటున్న ప్రతిసమస్యకు భగవద్గీత పరిష్కారాల నందిస్తున్నది మృత్యుసంసారసాగరంలో మునిగిపోతూ చావుబతుకుల మధ్య వేలాడుతున్న మనకందటికీ భగవద్గీత నిజంగా అమృతోపదేశం అందుకే పెద్దలిలా చెబుతారు-

సర్వోపనిషదో గావః దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్

ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు ఈ మూడింటిని ప్రస్థానత్రయం అంటారు అందులో మధ్యమణిస్థానాన్ని ఆక్రమించుకొన్న మహోత్కృష్టగ్రంథం భగవద్గీత బ్రహ్మసూత్రాలకంటే తరువాత సంకలనం చేయబడినా భగవంతుడు గానం చేసింది కావడంవల్ల అద్వితీయమైన ద్వితీయస్థానాన్ని ఆక్రమించుకున్నది భారతజాతి జీవనానికి, సంస్కృతికి, ఆధ్యాత్మికభావనలకు భగవద్గీత అపురూపంగా అద్దం పడుతున్నది

ఇది వ్యాసమహర్షి అనుగ్రహంతో మన కందించిన మహాభారతం భీష్మపర్వంలో అమర్చబడి ఉంది పద్దెనిమిది అధ్యాయాలుగా విభజించబడిన ఈ భగవద్గీతలో 701 శ్లోకాలున్నాయి ప్రతి అధ్యాయంలో ప్రస్తావించబడిన తాత్త్వికాంశాలలో ఎంతో వైవిధ్యం కనబడుతుంది మానవుని మౌలికసమస్యలు, వాటినుంచి అతడు సముద్ధరింపబడటానికి కావలసిన సాధన, ఉపదేశం సమగ్రంగా ఇందులో పొందుపరచబడినాయి

మొదటి అధ్యాయం అర్జునవిషాదయోగం మనస్సులో ప్రసాదం లోపిస్తే విషాదం చోటు చేసుకుంటుంది ప్రసాదమంటే ప్రసన్నత్వం ఇది సత్త్వగుణలక్షణం దైవీసంపదలతో ఉన్నవాడు, సాత్త్వికశ్రద్ధతో చక్కని బుద్ధితో ప్రవర్తిస్తాడు అతని భావనలో, భాషలో ప్రశాంతత

ప్రతిఫలిస్తుంటుంది చేష్టలు ఇతరులకు కష్టం కలిగించకుండా సున్ని తంగా ఉంటాయి ఈ సత్త్వస్థితి తప్పి తామసప్రవృత్తి కలిగినప్పుడు ఆవేశంతో అసలు తానెవరో తన కర్తవ్యమేమిటో మర్చిపోయి మత్తుతో సోమరితనాన్ని పెంచుకుంటాడు అకర్మణ్యలక్షణం అతనిలో అచ్చుపో సినట్లు కనబడుతుంది ప్రస్తుతం అర్జునుణ్ణి క్రమంగా ఆ అకర్మణ్యత ఆవహించింది

మహోత్సాహంతో మహారణరంగమైన కురుక్షేత్రంలో అడుగుపెట్టాడు అర్జునుడు మొదట శత్రుసేనలను చీల్చి చెండాడి విజయలక్ష్మిని వరించాలనే తహ తహ అతడి ముఖంలో కనబడింది తానొక మహార ధినని, సవ్యసాచినని అహంభావం అంకురించింది సకలజగన్నాథుడైన శ్రీకృష్ణుణ్ణి కేవలం తన రథసారథిగా భావించాడు-

"సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత"

అని ఆజ్ఞాపించాడు మాయామానుషవిగ్రహుడు, మాయగోపాలుడు మనసులో నవ్వుకొని అర్జునుడు చెప్పినట్లే చేశాడు

దర్పంగా తన బలాన్ని ఒకసారి చూసుకొని, తృణీకార భావంతో శత్రుబలాన్ని చూశాడు శ్వేతవాహనుడు కన్నులు చెదిరాయి మళ్లా మళ్లా చూశాడు మమకారం మఱీ ఎక్కువైంది- ఏమిటి? భీష్ముడు, ద్రోణుడు, కృపుడు - అంతా నా గురువులు, బంధువులు, మిత్రులు, పుత్రులు, పౌత్రులు అయ్యో! వీళ్లనా నేనీ యుద్ధంలో సంహ రించాల్సింది? నేనేం బావుకుంటాను? కాబట్టి నాకీ యుద్ధమూ వద్దు, రాజ్యమూ వద్దు "- అని విషణ్ణుడై గాండీవాన్ని క్రిందపడేసి కుప్పకూలిపోయాడు

సమాజంలో ఎవడికైనా ఇది సహజమైన లక్షణమే ముందు ఆరంభశూరత్వంతో ప్రతివాడు పని మొదలుపెడతాడు కొంచెం దూరం జరిగిన తరువాత అజ్ఞానంలో ఏవేవో ఆలోచనలు వస్తాయి అంతే అసలు నాకీ పనే అక్కర్లేదు ఇది లేకపోతే నేను బ్రతుకలేనా? అని అస్త్రసన్న్యాసం చేసేస్తాడు ఇలాంటి చంచలమనస్తత్త్వం కల సోదరులకు ప్రతినిధే ఇక్కడ పార్థుడు

శ్రీకృష్ణుని అవతారానికి పరమప్రయోజనమే గీతోపదేశం ఉపదే శానికి ఉచితమైన కాలం కావాలి అనువైన అవసరం ఏర్పడాలి యోగ్యుడైన వ్యక్తి కావాలి సరైన అదనుకోసం వేచి వేచి యుద్ధరంగంలో విషాదగ్రస్తుడైన అర్జునుణ్ణి ఉపదేశానికి వ్యాజంగా పెట్టుకున్నాడు భగవాన్

అతడి అజ్ఞానాన్ని పోగొట్టి కర్తవ్యోన్ముఖుణ్ణిగా తయారుచేశాడు ఆదిదేవుడు ఆత్మతత్త్వాన్ని లోకంలో ఆవిష్కరించడానికి ఉపయోగపడిన విషాదం కాబట్టి అర్జునవిషాదం యోగమైంది గీతోపదేశమహాభవనానికి అది పునాది అయింది ఆత్మతత్త్వామరద్రుమావిష్కరణానికి విషాదమే బీజమైంది సంసారసాగరంలో మునుగుతూ తేలుతూ కొట్టుమిట్టాడుతూ కొన ఊపిరిలో మిగిలిన జీవులందరికీ, దాన్ని తరించడానికి ఉపయోగించే ఈత ఈ భగవద్గీత

సాధనకోసం కర్మ-జ్ఞాన- భక్తి యోగాలను ప్రధానమార్గాలుగా ప్రతిపాదిస్తున్నది భగవద్గీత

కర్మలను వదిలిపేయకుండా, బంధహేతువైన కర్మఫలాన్ని మాత్రం అపేక్షించక చిత్తశుద్ధితో కర్తవ్యభావనతో కర్మలను ఆచరించడాన్నే కర్మయోగ మంటారు కర్మయోగంలో కర్మఫలాన్ని అపేక్షించకపోవడంవల్ల మనలో మొదట భోక్తృత్వాభిమానం నశిస్తుంది క్రమంగా కర్తృత్వాభిమానం కూడా కనుమరుగౌతుంది పరమాత్మ వ్యక్తస్వరూపమైన ఈ ప్రపంచాన్ని నిష్కామకర్మలతో కర్మయోగులు సేవిస్తారు అంశాంశిభావంతో ఆయనతో ఏకత్వాన్ని అనుభవంలోకి తెచ్చుకుంటారు

ఏపనీ చెయ్యకుండా ఎవ్వడూ ఉండలేడు ప్రకృతిగుణాలైన సత్త్వం, రజస్సు, తమస్సు ప్రతివాడిచేత ప్రతిక్షణం ఏదో ఒక పనిని చేయిస్తూనే ఉంటాయి కర్మేంద్రియాలను అణచిపెట్టి, పైకి విరాగిలాగా కనపడుతూ, మానసికంగా విషయసుఖాల ననుభవించేవాడు గొప్ప మోసకారి జ్ఞానేంద్రియాలను మనస్సును నిగ్రహించి, సంగంలేకుండా కర్మేంద్రియాలద్వారా కేవలం కర్తవ్యభావనతో కర్మ లాచరించేవాడే కర్మయోగి అని భగవానుని ఉపదేశం అలాంటి కర్మయోగికే నైష్కర్మ్యసిద్ధి కలుగుతుంది

ఫలాసక్తితో చేసే ప్రతిపనీ మనల్ని బంధిస్తుంది అనాసక్తియోగంతో కర్మల నాచరించి జనకాదిరాజర్షులు సిద్ధిని పొందారు కనుక నిష్కామంగా కర్మల నాచరించమని భగవద్గీత చేసే భవ్యోపదేశాన్ని ఆలకించండి-

తస్మా దసక్తః సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః

ఎవరి కర్తవ్యాన్ని వాళ్ళు శ్రద్ధగా ఆచరించమంటుంది భగవద్గీత "నే నింత గొప్పవాణ్ణి కదా! ఈ చిన్న చిన్న పనులు నేను

చేయడమెందుకు?" అంటుంటారు ఈ సమాజంలో కొందఱు కాని కర్మయోగంలో సిద్ధిని పొందిన వాళ్లు కూడా లోకానికి "సరైన మార్గం ఇది" అని తెలియజేయడానికి కర్మల నాచరించాల్సిందే లోకం ఎప్పుడూ గొప్పవాడు నడచిన మార్గంలోనే పోతూ ఉంటుంది వాడు దేన్ని ప్రమాణంగా తీసుకుంటే దాన్నే అనుకరిస్తుంది అందుకనే చుట్టూ ఉన్న సమాజం మంచిగా ఉండాలని కోరేవాడు ముందు తాను మంచిగా ఉండటం నేర్చుకోవాలని భగవానుడెంత చక్కగా మన కుపదేశిస్తున్నాడో చూడండి-

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదే వేతరో జనః,
స యత్ ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే

ఆత్మను ఇతర పదార్థాలకంటే భిన్నమైన తత్త్వంగా గ్రహించి, బుద్ధితో విచారణ చేసి, తాము ఆత్మస్వరూపులమని జ్ఞానయోగాన్ని సాధన చేసేవాళ్ళు గ్రహించగలుగుతారు వాళ్లకు కర్తృత్వాభిమానం ఉండదు నేను సాక్షిమాత్రుడననే ఎరుక ఉంటుంది కర్తృత్వాభిమానం లేకపోవడంవల్ల, భోక్తృత్వాభిమానాన్ని ఫలాసక్తిని కూడా వాళ్లు తేలికగా పోగొట్టుకోగలుగుతారు

ఎన్ని పాపాలు చేసినవాడైనా ఈ జ్ఞాననిష్ఠను పొందగలిగితే, అగ్నిహోత్రుడు కట్టెలను కాల్చేసినట్లు వాటినన్నింటిని జ్ఞానంతో నశింపజేసుకోగలుగుతాడు వినండి భగవాన్ విశిష్టోపదేశం-

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః

ఎవరు నిరంతరం భగవంతునిపైనే మనస్సును లగ్నంచేసి, శ్రద్ధతో ఉపాసిస్తారో వారే భక్తులు వారనుష్ఠించే యోగమే భక్తియోగం

భక్తియోగాన్ని సాధించినవాడిలో సంతోషం, ద్వేషం, దుఃఖం, కాంక్ష ఇవేవీ కనబడవు పుణ్యాపాపకర్మలను రెంటినీ అతడు భగవంతునికే సమర్పిస్తాడు మిత్రులు, శత్రువులు, మానావమానాలు, శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, నిందాస్తుతులు, మొదలైన ద్వంద్వాల విషయంలో సమబుద్ధితో ఉండి, సంగం లేక అప్రయత్నంగా లభించినదానితో సంతృప్తిపడి, మౌనంగా ఉంటూ, ఒకే చోట స్థిరంగా ఉండకుండా అతడు స్థిరబుద్ధితో ఉంటాడు ఇలాంటి భక్తుడంటే భగవంతుని కెంతో ఇష్టం

వృత్తులను ప్రవృత్తులను బట్టి దైవీసంపదకలవారు, ఆసురీసంపదకలవా రని మానవులను రెండురకాలుగా విభజించుకోవచ్చు

దైవసంపదలో పుట్టినవాళ్లు సత్త్వగుణంతో ఉంటారు వివేకం, నిర్భయం, దానం, ఇంద్రియనిగ్రహం, భగవంతుణ్ణి సదా ఆరాధించడం, స్వాధ్యాయం, తపస్సు, ఋజువుగా ఉండటం, అహింస, సత్యం, కోపం లేకపోవడం, శాంతితో ఉండటం మొ గుణాలు వీరిలో కనబడుతాయి

ఇక ఆడంబరం, పొగరుబోతుతనం, దురభిమానం, కోపం, పరుష భాషణం మొ ఆసురీసంపదలో పుట్టినవారికి సహజలక్షణాలు వీళ్లకు సంసారంలోకి పోయే ప్రవృత్తిమార్గం, తిరిగి భగవంతునిచేరే నివృత్తిమార్గం అని రెండు మార్గా లున్నాయని తెలియదు వీళ్లల్లో పరిశుభ్రత, మంచినడవడి, సత్యనిష్ఠ మచ్చుకైనా కనబడవు ఈ ప్రపంచం మిథ్య అని, సృష్టికర్త అయిన భగవంతుడు లేడని, కామంతో స్త్రీపురుషులు కలవడంవల్లనే సృష్టి జరుగుతున్నదని, అంతకంటే వేరే కారణమేదీ లేదని వీరి అభిప్రాయం వీళ్లు అంతర్యామిగా ఉన్న భగవంతుణ్ణి తనలో గాని, ఇతరుల్లోగాని తెలుసుకోలేక దేవుడున్నాడా? ఉంటే ఏడీ? కనపడడేం? అని దూషిస్తారు

ఈనాడు సమాజంలో ఇలాంటి బాపతే నూటికి తొంభై మంది అని వేటే చెప్పనక్కర్లేదు దైవసంపదను వెతికి వెతికి తెలుసుకోవాలిగాని ఆసురీసంపద విశ్వవ్యాప్తంగా ఎక్కడైనా దర్శనమిస్తుంది అంగరంగవైభ వాలతో ఉన్న ఆసురీసంపదను అభ్యాసంతో అణచివేసి, దయనీయంగా ఉన్న దైవసంపదను అందటిలోను ఉద్ధరించాలి

సామాజికదృక్పథంతో భగవద్గీత భవ్యోపదేశాన్ని అర్థం చేసుకోవడా నికి ప్రయత్నిస్తే ఈనాడు మనం చూస్తున్న అనర్థాలన్నీ అంతరిస్తాయి మోకాళ్లు పట్టుకుపోయి మోక్షార్థులైన వాళ్లకు మాత్రమే భగవద్గీత అవసరమని ఎవరైనా అనుకుంటే అది అజ్ఞానంతో అనేమాట అని అనకతప్పదు సహస్రాధికసమస్యలతో సతమతమయ్యే సగటు మానవు డికి కూడా గీతామాత తన సందేశాన్ని అందిస్తున్నది ఇక్కడే ఈ లోకంలోనే మనం చక్కని సమాజాన్ని నిర్మించుకోవడానికి భగవద్గీత మనకు చక్కని ఉపదేశం చేస్తున్నది ఆ మహోపదేశాన్ని చెవిలో వేసుకుంటే మనం తృప్తితో జీవించవచ్చు ఈ సమాజాన్ని శాంతితో జీవించనీయవచ్చు

చూడండి - ప్రతివాడికి ఎన్నో కష్టాలు, సుఖాలు ఏర్పడుతూనే ఉంటాయి సంసారంలో అది చాలా సహజమైన విషయమే కానీ మానవుడు కష్టాలకు కుంగిపోతాడు సుఖాలకు ఉబ్బి తబ్బిబ్బు లౌతాడు

గీతామాత అలా కాకూడదని చెబుతుంది ఎలాంటి ఉద్రేకాలకు గురికా కుండా స్థిరబుద్ధితో వివేకంతో ఉండమని ఇలా ఉపదేశిస్తుంది

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్,
స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవిద్ బ్రహ్మణి స్థితః

ఎన్ని చదువులు చదివినా, ఎన్ని దేశాలు తిరిగినా, ఎంత వయస్సు వచ్చినా, సమసమాజస్థాపనకోసమే అవతరించామని గొంతులు ఎంత చించుకున్నా సమాజంలో ప్రతివాడిని తనతో సమానంగా చూడటం కొద్దిమందిలో కూడా కనపడదు ఎవరికైనా కష్టం వస్తే అది తనకే వస్తే తనెంత బాధపడతాడో, ఇతరుల సాహాయ్యం కోసం ఎంతగా ఎదురుచూస్తాడో, అలాగే ఇతరుడికి కూడా ఉంటుందని భావించి అతణ్ణి ఆదుకోవాలి ఆదరించాలి ఇతరులకు కష్టం కలగకుండా జాగ్రత్తగా అందఱు ప్రవర్తిస్తే ఎవరికీ ఏబాధలూ ఉండవు అలా ప్రవర్తించేవాడే తనకు ప్రీతిపాత్రుడని భగవంతుడు చెబుతున్నాడు చూడండి -

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః

నీ ప్రవృత్తి, చుట్టూ ఉండేవాళ్లను భయపెట్టేటట్లు ఉండకూడదు అలాగే ఈ లోకాన్ని చూసి నీవు భయపడకూడదు సంతోషం, కోపం, భయం, ఈ మూడింటి ఉద్రేకాలు నీ మనస్సును తలకిందు చేయకూడదు అప్పుడే నీవు భగవంతుడికి ప్రేమపాత్రుడ వౌతావని భగవద్గీత ఎంత చక్కగా ఉపదేశిస్తుందో చూడండి

యస్మాన్నోద్విజతే లోకః లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః

ఎవ్వరికీ భయపడని మానవుడు కూడా మరణాన్ని చూసి భయపడ తాడు నిజమాలోచిస్తే మరణభీతితో మఱీ చెడిపోతున్నాడు మానవుడు తను ఎన్నాళ్లు బ్రతుకుతాడో ఎవడూ ఖచ్చితంగా చెప్పలేడు ఇది విశ్వంలో అందఱికీ సంబంధించిన సమస్య అలాంటి మరణాన్ని గురించి భగవద్గీత ఇస్తున్న సందేశం ఏమిటి? చూడండి -

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ

సరదాగా కొత్త గుడ్డలు కుట్టించుకున్నాం కొన్నాళ్లకు అవి పాతబ డిపోతాయి వాటిని వదలి పెట్టి వేరే గుడ్డలు తొడుక్కుంటాం కాని పాతగుడ్డలను వదిలేశామని ఎవరన్నా ఏడుస్తున్నారా? లేదు మన ఆత్మకూడా అలాగే శిథిలమై పోయిన శరీరాన్ని వదిలిపెట్టి ఇంకో శరీరంలో ప్రవేశిస్తుంది ఆత్మ శరీరాన్ని వదిలిపెట్టడమే మరణం ఇంకో శరీరాన్ని పొందడమే జన్మ మానవుడు వద్దన్నా ఇది ఆగేది కాదు కనుక చనిపోతామని ఏడవడం, లేక ఎవడో చనిపోయాడని ఏడవడం శుద్ధ అవివేకం అలాగే అశాశ్వతమైన ఈ శరీరాన్ని శాశ్వత మనుకొని, దాని కోసం రాగద్వేషాలతో, అహంకారంతో జీవితాన్ని పాడు చేసుకోకూడదు ఇది మానవజాతి కంతటికీ భగవద్గీత అందిస్తున్న భవ్యోపదేశం

భగవద్గీత మన కందించే సందేశం ఏదో ఒక దేశానికో ఏదో ఒక కాలానికో పరిమితమైంది కాదు ఈ విశాలవిశ్వంలో ఉన్న మానవజాతి కంతటికీ సంబంధించింది ఎందుకంటే మానవులందరికీ కొన్ని సమా నమైన సమస్యలున్నాయి అవి ఏదేశంలో పుట్టినా ఏ కాలంలో పుట్టినా మారేవి కావు వాటిని పరిష్కరించుకోవాలంటే సాధన కావాలి ఆ సాధనను సమగ్రంగా వాళ్లకు వాళ్లకు తగినట్లు సమన్వయిస్తూ నిరూపిస్తున్నది భగవద్గీత ఇంకా వివరాలు "మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు" అనే నా రచనలో విస్తరంగా చర్చించాను భగవద్గీత ఆదేశం విశ్వజనీనసందేశం అది విశ్వకల్యాణానికి ఉద్దేశింపబడిన మహోపదేశం

# 6. సుగుణాల ప్రతీక శ్రీరామచంద్రుడు

అర్థకామాలకు ధర్మంతో జరిగిన సంఘర్షణకు అద్దం పడుతున్నది ఆర్షవాఙ్మయసారసర్వస్వం శ్రీమద్రామాయణం ఇది అజరామరుడైన ఆదికవి వాల్మీకి మనకందించిన అమృతోపాయనం దీన్నే మహర్షి, "పౌలస్త్యవధ" మని "సీతాచరిత" మని కూడా అన్నాడు వేదవేద్యుడు ఆదర్శప్రభువు దాశరథిగా అవతరించగా, వేదమే ప్రాచేతసముని ప్రయత్నంవల్ల పౌలస్త్యవధంగా పరిణమించింది కమనీయమైన కవితాస్రవంతి, క్రాంతదర్శి అయిన కవితల్లజుని నోట కళకళలాడుతూ ప్రవహించింది ఇతిహాసహాసం కవితావిలాసం సమఉజ్జీలుగా సాక్షాత్కరించాయి మృదుమధురమైన భాష, దాన్ని మించిన శయ్య, దాన్ని తోసిరాజనే శైలి అహమహమికతో ఆదికవి రసనాగ్రరంగస్థలిపైన రసమయరమణీయనృత్యాన్ని ఆవిష్కరించాయి వాల్మీకి చేసిన వాణీ సమారాధనం వన్నెకెక్కడానికి ముఖ్యకారణం లోకోత్తరగుణోత్తరుడైన

శ్రీరామచంద్రుడు నాయకుడుగా దొరకడం

స్మితపూర్వాభిభాషి సుగుణాలరాశి శ్రీరామచంద్రుడు ధీరోదాత్తతకు దిద్దిన రూపమే ఆ మహానుభావుడు ధర్మానికి ఆకార మేమిటని ప్రశ్నిస్తే 'రామో విగ్రహవాన్ ధర్మః" అని పెద్దలు చెబుతారు తనకోసం కాక ఈ సమాజం కోసం దేన్నైనా త్యాగం చేయగల ఒక నిండైన మానవుడు రామభద్రుడు అందుకే ఆ మానవుడు మాధవుడై, దేవుడై, దేవదేవుడై చరిత్రపుటల్లో పవిత్రమూర్తిగా పరిగణింపబడి ప్రతిష్ఠ నందుకున్నాడు సాధుజనసంరక్షణకోసం సరైన తరుణంలో అవతరించిన ఆదిదేవుడే ఆ రఘునాధుడు ఆదర్శపుత్రుడు, ఆదర్శసోదరుడు , ఆదర్శభర్త, ఆదర్శమిత్రుడు చిట్టచివఱకు ఆదర్శశత్రువుకూడా శ్రీరామచంద్రుడేనని మనవారు యుగయుగాల నుంచి చెప్పుకుంటున్నమాట అందుకు కారణం- ఆయన గడిపిన నిస్స్వార్థత్యాగమయజీవనం అదే మనకందఱకు కావాలి సముజ్జీవనం

ఇంతటి మహోన్నతవ్యక్తిత్వాన్ని, మహితసంస్కారాన్ని మహామనిషి మహర్షి వాల్మీకి తన మహాకావ్యంలో ఎలా చిత్రించాడు? తన కథానాయకుణ్ణి ఎలా తీర్చిదిద్దాడు? సంస్కృతసాహితీనందనోద్యానంలో సర్వాంగసుందరమై రమ్యాతిరమ్యమైన ఈ రామచంద్రుడనే రమణీయ శిల్పాన్ని ఎలా సృష్టించాడు? ఇదే ఈ ప్రసంగానికి ప్రసంగసంగతి

సత్యధర్మాలకు శౌర్యపరాక్రమాలకు పుట్టినిల్లు సూర్యవంశం అలాంటి సూర్యవంశంలో దుష్టరాక్షససంహారం చేసి దుర్భరమైన భూభారాన్ని తగ్గించి, ధర్మోద్ధరణం చేయడానికి అఖిలాండనాయకుడు శ్రీరామచంద్రుడుగా అవతరించాడు బాల్యంనుంచి అతిమానుషమైన తన స్వరూప-స్వభావ-ప్రభావాలతో అందఱినీ ఆకట్టుకొన్నాడు "దాశరథి కరుణాపయోనిధి మాత్రం కాదు, సకలసద్గుణాలకు పెన్నిధి" అని ఆబాలగోపాలం ఆయనను ప్రశంసించింది

శ్రీరామచంద్రుని గుణసంపదను మూడు విధాలుగా మనం విశ్లేషించుకోవచ్చు దివ్యసుందరం, సకలజననయనాభిరామం, అతిలోకరమణీయమైన ఆయన రూపసంపద అందులో మొదటిది మృదుమధురం, వినిర్మలం, ఆత్మగుణసంశోభితమై ప్రకాశించే దివ్యస్వభావసంపద రెండవది ఇక మూడవది, ఆదిదేవుని అవతారం కావడంవల్ల ముల్లోకాలను మూడుక్షణాలలో నియమించగల మహామహిమసంపన్నమైన ప్రభావసంపద ధీరోదాత్తుడైన శ్రీరామచంద్రుని మహోదాత్తపాత్రను

చిత్రించడంలో మహర్షి వాల్మీకి పై మూడు అంశాలను మనసులో ఉంచుకున్నాడని రామాయణం చదువుతుంటే అడుగడుగునా మనకు అవగతమవుతుంది

అతిలోకసౌందర్యమూర్తి శ్రీరామచంద్రమూర్తి ఆజానుబాహువు అరవిందదళాయతాక్షుడు , విశాలమైన వక్షస్థలం, విపులమైన భుజాలు, శంఖంలాంటి మెడ, విస్తరించిన నుదురు, సరిసమానంగా విభజించబడిన అవయవాలు గలిగి, పదే పదే చూడాలనిపించే దివ్యమైన ఆకర్షణతో నిండిన పరిపూర్ణమైన రూపసంపద గలవాడు ఆ మహనీయుడు మహర్షి వాల్మీకి మధురమైన మాటలలో ఆమహానుభావుని రూపాన్ని ఎలా వర్ణిస్తున్నాడో చూడండి—

విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో మహాహనుః,
మహోరస్కో మహేష్వాసో గూఢశత్రురరిందమః,
ఆజానుబాహుస్సుశిరా స్సులలాట స్సువిక్రమః
సమస్సమవిభక్తాంగః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్,
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః

లోకంలో ఏ స్త్రీ, ఇంకో స్త్రీసౌందర్యాన్ని మెచ్చుకోదు అలాగే ఏ పురుషుడూ ఇంకో పురుషుడి సౌందర్యాన్ని మెచ్చుకోడు కాని పరమపురుషుడు జగదేకసుందరుడైన జానకీనాథుని రూపలావణ్యాశోభాతిశయాలు పురుషకోటికే ప్రియాతిప్రియంగా పరిణమించాయంటే - ఆలోచించండి ఆ పుంసాంమోహనరూపుడు ఎంతటి అందాలరాశి అయి ఉంటాడో! అందుకే ఇలా అంటాడు వాల్మీకి-

యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి,
నిందితః సర్వలోకేషు స్వాత్మాప్యేనం విగర్హతి

ముల్లోకాల్లో ఎవరు రాముని దర్శించలేదో, ఎవరిపై ఆ దేవదేవుని అపాంగవీక్షణం పడదో నిజంగా వాడి జన్మ వ్యర్థం వాడి ఆత్మే వాణ్ణి నిందిస్తుంది ఇంతటిది! శ్రీరామచంద్రుని రూపలావణ్యసంపద

ఇక ఆయన స్వభావసంపదను పరిశీలిద్దాం-

మృదుమధుర మందస్మిత పూర్వాభిభాషి, మేరుసమానధీరుడు, సముద్రగంభీరహృదయుడు, ఆత్మశ్లాఘావిముఖుడు ధీరోదాత్తస్వభావుడు శ్రీరామచంద్రుడు నిరతిశయమైన త్యాగనిరతితో, ఆడినమాట తప్ప

కుండా సత్యధర్మాలకు ఆలవాలమై విలసిల్లిన మహోన్నతవ్యక్తిత్వ మాయ నది ఆదికవి వాల్మీకి ఆవేదనతో నారదుణ్ణి "సకలసుగుణాభిరాముడైన ఇలాంటి వ్యక్తి ఈనాడు లోకంలో ఎవరైనా ఉన్నారా? దయచేసి నాకు చెప్పగలరా? అని తనకు కావలిసిన ఉత్తమలక్షణాలన్నింటినీ పూసగుచ్చి ఇలా అడుగుతాడు-

కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్,
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః
చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః,
విద్వాన్ కః కః సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః
ఆత్మవాన్కో జితక్రోధో ద్యుతిమాన్కో ౨నసూయకః,
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే

త్రికాలజ్ఞుడైన నారదుడు తన దివ్యజ్ఞానంతో భగవాన్ దివ్యావతా రమైన శ్రీరామచంద్రునిలో తప్ప ఈ గుణగణాలు ఇతరత్ర దుర్లభమని తెలుసుకొని వాల్మీకితో ఇలా చెబుతాడు- "ఇక్ష్వాకువంశంలో అవతరించిన ఆ పరమపురుషునిలో ఈ లక్షణాలన్నీ ఉన్నాయి నియతాత్ముడు, మహావీరుడు, శమదమాదిసంపన్నుడు, బుద్ధిమంతుడు, నీతిమంతుడు, సరససంభాషణచతురుడు , సత్యప్రతిజ్ఞ కలవాడు, ప్రజాహితాన్ని ఆకాం క్షించేవాడు, జీవలోకాన్ని, ధర్మాన్ని పరిరక్షించేవాడు, స్వధర్మాన్ని తన నాశ్రయించిన వారిని తప్పక కాపాడేవాడు అయిన ఆ మహానుభావుడు త్యాగానికి మారుపేరు ఆయన పేరు శ్రీరామచంద్రుడు

ఆ దాశరథి గుణగణాలు అనంతాలు, అప్రమేయాలు ఎన్ని విధాలుగా అభివర్ణించినప్పటికీ అవి మన మాటల కందేవి కావు కనుకనే ఎంతో చెప్పికూడా తనివి తీరక, మహర్షి ఆ దివ్యపురుషుని స్వభావాన్ని సూటిగా రెండుమాటలలో ఇలా చెబుతున్నాడు వినండి-

స చ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః,
సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ
విష్ణునా సదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః,
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః,
ధనదేన సమస్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః

గాంభీర్యంలో సముద్రంలాగాను, ధైర్యంలో హిమవత్పర్వతంలాగాను

ఉండే ఆ జానకీజాని వీర్యంలో విష్ణుసదృశుడు, ప్రియదర్శనంలో చంద్రసమానుడు, క్రోధంలో కాలాగ్నిసన్నిభుడు, ఓర్పులో పృథివీసముడు, త్యాగంలో కుబేరప్రతిముడు, సత్యనిష్ఠలో యమధర్మరాజువంటివాడు

సూర్యవంశపు రాజులకు త్యాగం ఆజన్మసిద్ధమైన గుణం అసలు మానవజన్మ సార్థకం కావాలంటే త్యాగమనేది గొప్ప సాధనం త్యాగధనులైన మహనీయులే మానవజాతిచరిత్రలో మహితాత్ములుగా సువర్ణాక్షరాలతో లిఖింపబడ్డారు అందువల్లనే శ్రుతి త్యాగంవల్లనే అమృతత్వం సిద్ధిస్తుందని ఇలా ఉద్ఘోషిస్తున్నది–

"త్యాగేనైకే అమృతత్వమానశుః"

ఈ త్యాగగుణం శ్రీరామచంద్రునిలో సహజసిద్ధంగా ఏర్పడింది ఆయన జీవితమంతా నిస్స్వార్థమైన త్యాగంతో నిండి ఉన్నది చూడండి ఆ మహనీయుని జీవితంలో మనకు కనపడేవి ప్రధానంగా మూడు త్యాగాలు అందులో మొదటిది - విశ్వామిత్రయాగసంరక్షణకోసం ప్రాణాతిప్రియంగా తనను ప్రేమిస్తున్న కన్నతండ్రి దశరథుణ్ణి త్యజించి అడవులకు వెళ్లిపోవడం రెండవత్యాగం - వివాహితుడై, యౌవరాజ్య పట్టాభిషేకం చేసుకొని, రాజ్యాన్ని చేబట్టి ప్రజల కష్టసుఖాల్లో పాలు పంచుకొని వారిని పరిపాలించవలసిన తరుణంలో తండ్రి మాటకు కట్టుబడి కట్టుబట్టలతో రాజ్యాన్ని వదిలిపెట్టి అరణ్యాలకు వెళ్లిపోవడం ఇక మూడో త్యాగం మానవజాతి చరిత్రలోనే అనన్యసాధారణమైంది, ఇంకెవ్వరు చేయనిది చేయలేనిది వంశప్రతిష్ఠను, ప్రజల అభిప్రాయాన్ని దృష్టిలో పెట్టుకొని తన ప్రాణాల కంటే మిన్న, వంశాంకురా న్నందించే నిండుచూలాలైన భార్యను చెప్పకుండా అడవులలో వదిలివేయడం తన సుఖం కోసం ప్రియురాలికోసం రాజ్యాధికారాన్ని పరిత్యజించే ప్రబుద్ధులున్నారు గాని, తనవఅకు పరంపరగా సంక్రమించిన వంశప్రతిష్ఠను కాపాడటానికి, ప్రజానురంజనం చేయడానికి ధర్మపత్నిని, అందులోను నవమాసాలు నిండిన గర్భవతిని పరిత్యజించడం ఎక్కడా చరిత్రలో వినలేదు, కనలేదు ఈ మూడు త్యాగాలతో మానవజాతి మానవధర్మాన్ని అతిక్రమించి తనలో గల మాధవతత్త్వాన్ని ప్రకటించిన మహాప్రభువు మన రాజారాముడు మా గురువర్యులు 'కళాప్రపూర్ణ' 'మహోపాధాయ' శ్రీమాన్ ఎస్ టి జి వరదాచార్యులవారు ఈ భావాన్ని తమ 'సుషుప్తివృత్తం' ప్రారంభంలో ఇలా ఆవిష్కరించారు-

సంత్రాతుమిష్టం పితరం స్వబాల్యే
పితుర్వచః పాలయితుం ప్రజాశ్చ,
ప్రజాస్సమారాధయితుం చ దారాన్
తత్యాజ యస్తం ప్రణమామి భూపమ్

ఇక శ్రీరామచంద్రుడు గాంభీర్యంలో సముద్రుని వంటి వాడనటం అక్షరాల సత్యమైన మాట ఆ మహాధీరుని పరమగంభీరస్వరూపాన్ని మహర్షి శ్రీమద్రామాయణంలో అనేకసందర్భాలలో చక్కగా అభివర్ణించాడు ఇందుకు ఉదాహరణలు కోకొల్లలుగా దొరుకుతాయి అయినా శివధనుర్భంగం, పరశురామవిజయం, పట్టాభిషేకభంగం, విభీషణశరణాగతి మొదలైన ఘట్టాలు ఆయన గాంభీర్యాన్ని తెలియజేయడంలో మచ్చుతునకలు చూడండి-

పట్టాభిషేకం పట్టుమని పదిగడియలైనా లేదు చిఱునవ్వులు చిందిస్తూ తండ్రిని సందర్శించడానికి అంతఃపురానికి వెళ్లాడు శ్రీరాముడు తండ్రిమాటగా తమ్ముడు భరతునికి పట్టాభిషేకమని, తనను అరణ్యాలకు వెళ్లిపొమ్మన్నది పినతల్లి కైకేయి మేరుసమానధీరుడు శ్రీరాముడు అదే చిఱునవ్వుతో అంతఃపురంనుంచి అరణ్యాలకు తరలి వెళ్లడానికి బయటకు వస్తున్నాడు ఆహా! ఎంతటి గాంభీర్యం! ఎంతటి ధీరప్రవృత్తి! ఆ పిడుగుపాటు వార్తను విన్నా ఆ ముఖబింబంలో చిఱునవ్వు చెరిగిపోలేదే! అందుకే అంటాడు ఒక మహాకవి-

ఆహూతస్యాభిషేకాయ విసృష్టస్య వనాయ చ,
న మయా లక్షితస్తస్య స్వల్పోఽప్యాకారవిభ్రమః

సుఖదుఃఖాలు పరిగెత్తే మేఘాల్లాంటివి మనం ధైర్యంతో నిశ్చలంగా నిబ్బరంగా సమభావనతో ఉండి రెండింటినీ సమానంగానే తీసుకోవాలనే సందేశం శ్రీరాముని ప్రవృత్తిలో కనబడుతుంది

సత్యమే ఈ సమాజానికి గరిమనాభి సత్యాన్ని త్రికరణ శుద్ధితో పాలించకపోవడమే ఈ సమాజం సర్వనాశనమై పోవడానికి ప్రధానకారణం ఆడినమాట తప్పని వంశం ఇక్ష్వాకువంశం లోకంలో సత్యధర్మాలను వ్యవస్థాపనం చేయడానికే ఆ వంశంలో ఆదిదేవుడు దాశరథిగా అవతరించాడు లోకరావణుడైన రావణుని సంహరిస్తానని దేవతలకు, మునులకు ఇదివఱకు మాట ఇచ్చాడు అందుకే అయోధ్యలో అందలాలెక్కి కూర్చోకుండా అరణ్యాలలో అసురసంహారం చేస్తూ ఉండి

పోయాడు శ్రీరామచంద్రునిది ఒకే మాట, ఒకే బాణం, ఒకే పత్ని అని చరాచరప్రపంచమంతా ముక్తకంఠంగా ప్రశంసించింది "రాముడు రెండు మాటలు మాట్లాడేవాడు కాద" ని ఇలా ప్రతిజ్ఞ చేసి కైకేయితో చెప్పాడు- 'కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభిభాషతే',

ఆహా! ఎంతటి ఆత్మవిశ్వాసం! ఎటువంటి ఆదర్శజీవనం!

శ్రీరాముని పితృభక్తి, పితృవాక్యపరిపాలనాసక్తి అనన్యసామాన్యం పౌరమంత్రిసామంతాదులతో భరతుడు చిత్రకూటానికి వచ్చి అన్నతో "త్వమేవ రాజా ధర్మజ్ఞః" అని, తిరిగివచ్చి రాజ్యాన్ని పరిపాలించమని పరిపరివిధాలా ప్రాధేయపడతాడు "తండ్రి దశరథుడు చెప్పిన మాట నాకెంతో హితమైంది దాన్ని పరిపాలించడమే నాకు ముఖ్యకర్తవ్యం ఆ కర్తవ్యం ముందు, సర్వలోకాధిపత్యం ఇస్తానన్నా నేను లెక్కచెయ్యను" - అని తమ్ముణ్ణి సమాధానపరచి పంపుతాడు రామభద్రుడు వాల్మీకి మహర్షి ఈ సందర్భాన్ని ఎలా చిత్రించాడో వినండి-

యదబ్రవీన్మాం నరలోకసత్కృతః
పితా మహాత్మా విబుధాధిపోపమః,
తదేవ మన్యే పరమాత్మనో హితం
న సర్వలోకేశ్వరభావమప్యహమ్

ఈ సందర్భంలోనే అయోధ్యాకాండలో భరతునికి శ్రీరాముడు చేసిన ఉపదేశం నిజంగా మరపురానిది తరువాత ద్వాపరయుగంలో శ్రీకృష్ణావతారంలో పద్దెనిమిది అధ్యాయాలలో భగవద్గీతద్వారా చేసిన ఆధ్యాత్మికతత్త్వోపదేశమంతా అతిసంగ్రహంగా ఇక్కడ ఒక్క అధ్యాయంలోనే కనబడుతుంది ఈ ఉపదేశాన్ని చదివితే, రామచంద్రునిలో గల సమున్నతమైన తాత్త్వికదృష్టి మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తుండ ఆ ఘట్టంలో నిత్యసత్యాల నెన్నింటినో ఆవిష్కరించిన ఆ మహనీయు డొక జగద్గురువుగా భాసిస్తాడు శ్రీమద్రామాయణమంతా చదివినా ఆ ఉపదేశాన్ని శాంతచిత్తంతో అర్థం చేసుకోని మానవజన్మ వ్యర్థమే ననిపిస్తుంది

ఇతరులు చేసిన అపరాధాలను క్షమించడమనేది ఒక గొప్ప గుణం అది అందఱికీ తేలికగా అబ్బేది కాదు శూర్పణఖా కాకాసురాది వృత్తాంతాలలో ఆ గుణం శ్రీరామచంద్రునిలో స్పష్టంగా కనబడుతుంది అంతెందుకు? తన భార్యనే మోసంతో అపహరించి మహాపరాధియైన

రావణుని విషయంలో కూడా ఆ మహనీయుడు ఎంతటి క్షమను ప్రదర్శించాడో ఆలోచిస్తే ఆశ్చర్యమౌతుంది "సుగ్రీవా! విభీషణునకు మాత్రమే కాదు, ఇప్పుడు రావణుడు స్వయంగా వచ్చినా నేను క్షమించి అభయమిస్తా" నని విభీషణశరణాగతిఘట్టంలో ఎలా అంటాడో చూడండి-

ఆన యైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా,
విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్

వారధి కట్టడానికి ప్రాయోపవేశం చేసినా, సముద్రుడు బయటకు వచ్చి కనబడలేదని మహోగ్రహోదగ్రుడైన శ్రీరాముని మాటలలో ఆయన కోపాగ్ని కాలాగ్నిసదృశమైందని తెలుస్తుంది చూడండి

" అద్య మే మరణం వాథ తరణం సాగరస్య వా,
చాపమానయ సౌమిత్రే! శరాంశ్చాశీవిషోపమాన్,
సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాన్తు ప్లవంగమాః "

ఈ రోజు సముద్రాన్ని దాటడం కాని నా అవతారం చాలించడం గాని తేలిపోవాలి లక్ష్మణా! నా కోదండాన్ని తీవ్రమైన బాణాలను తీసుకురా! వానరసైన్యం లంకకు నడిచివెళ్లడానికి వీలు కల్పిస్తాను సముద్రంలో ఒక్క నీటిబొట్టు లేకుండా చేసేస్తాను అని భీష్మప్రతిజ్ఞ చేస్తున్న శ్రీరాముని దగ్గఱకు సముద్రుడు గజగజలాడుతూ వచ్చి నిలబడతాడు

ఈ సంఘటన ఆయన మహామహిమసంపన్నతకు ప్రబలనిదర్శనం అలాగే చిన్న వయస్సులో మహాఘోరాకారయైన తాటకను సంహరించడం, శివధనుర్భంగం చేయడం, పరశురాముని జయించడం, గడ్డిపరకను బ్రహ్మాస్త్రంగా కాకాసురునిపై ప్రయోగించడం, ఒకే ఒక బాణంతో సప్తతాళవృక్షాలను ఛేదించడం, పర్వతాకారమైన దుందుభిశరీరాన్ని కాలి బొటనవేలితో పదియోజనాల దూరంలో పడవేయటం, సముద్రానికి వారధికట్టడం మొదలైన లీలలెన్నో ఆయన ప్రభావాన్ని అతిమానుషమైన దైవత్వాన్ని నిరూపించడానికి ఉదాహరణలు అన్నింటినీ మించి "ఒక్కసారి నన్నెవరు శరణాగతి చేసినా, వారందఱికీ అభయమిచ్చి కాపాడతాను అది నావ్రతము" ని ప్రతిజ్ఞచేసి చెప్పడం శ్రీరామచంద్రుడు ఒక సామాన్య మానవుడు కాడు, సాక్షాత్ మాధవుని అవతారమేనని చెప్పకనే చెబుతున్నది- చూడండి-

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ

దీన్నే శ్రీరామచరమశ్లోకమని కూడా అంటారు దుష్టశిక్షణ చేసి, శిష్టరక్షణ ద్వారా ధర్మసంస్థాపనం చేయడానికి అవతరించిన ఆదిదేవుడే సకలకళ్యాణగుణాభిరాముడు శ్రీరామచంద్రుడు సమాజంలోని ప్రతి వాడు మనసా వాచా కర్మణా ఆయనను ఆదర్శంగా తీసుకున్ననాడు మన రాజ్యం రామరాజ్యం కావడంలో ఆశ్చర్య మేముంటుంది?

# 7. నవరాత్రప్రశస్తి

తోటి మానవుడిలో మాధవుణ్ణి దర్శించగల సంస్కారం మన జాతి కున్నది దాని కనుగుణంగానే భారతీయులమైన మన జీవనవిధానం తీర్చి దిద్దబడింది కనుకనే ప్రపంచదేశాల్లో భారతదేశానికి అద్వితీయమైన స్థానం లభించింది

నిద్రలేచిన దగ్గఱనుంచి తిరిగి నిద్రించేవఱకు, ప్రతి ఉగాది నుంచి మళ్లా ఉగాది వఱకు, మానవుని జీవనవిధాన మెలా ఉండాలి? శారీరకంగా వాచికంగా మానసికంగా ఇతని ప్రవృత్తి ఎలా ఉండాలి? అతడలా ప్రవర్తించాలంటే అతడికి సంబంధించిన అలవాట్లు, ఆచారాలు ఎలా ఉండాలి? అనే విషయాలను గురించి మన దేశంలో ఎంతో కాలం పూర్వమే ఎన్నో చర్చలు కొనసాగాయి చాలా సిద్ధాంతాలు రూపొంది నాయి వాటి సారాంశాన్నే మనం గృహ్యసూత్రాలనీ, ధర్మశాస్త్రాలనీ అంటున్నాం

మహత్తరమైన మన సంస్కృతిని సంస్మరించుకొని, ఈ గడ్డపై

ఆవిర్భవించిన భగవదవతారాలను, వారి ప్రభావాలను పదే పదే మననం చేసుకొని, మహాపురుషుల దివ్యసందేశాలను మన మనఃఫలకాలనుంచి చెరిగిపోకుండా కాపాడుకుంటూ, శాంతిమయమైన జీవనాన్ని మనం గడుపుతూ, శాంతితో ఇతరులు బ్రతకడానికి అవరోధం కాకుండా ఉండాలంటే అప్పుడప్పుడు మన దైనందినజీవనపరిధిని దాటి మనం బయటపడాలి అలాంటి మార్పుకోసం, మానవసమాజానికి మహనీయ మైన స్ఫూర్తి నందించడంకోసం ఏర్పడినవే మనం ఆచరించే పండుగలు పర్వాలు, వ్రతాలు

ఒక సంవత్సరంలో మనం చేసుకొనే పండుగలను, వ్రతాలను జాగ్రత్తగా పరిశీలిస్తే వాటిల్లో ఎంతో వైవిధ్యం సమసమాజభావన, ఆధ్యాత్మికదృక్పథం, ఆరోగ్యలక్షణం ఇలా ఎన్నో విశేషాలు మనకు గోచరిస్తాయి అసలు నిజమైన మానవునికి ప్రతిరోజు ఒక పండుగ ఇతరులకు సేవ చేయడానికి, తన ఆత్మోన్నత్యాన్ని పెంపొందించుకోవ డానికి నిరంతరం కృషిచేసేవాడికి ప్రతి చిన్న అవకాశం మహాపర్వమే అవుతుంది మఱి కాని ఆ పండుగను దాని పుట్టుపూర్వోత్తరాలను పరిశీలించినప్పుడు దేని విశిష్టత దానికే ఉన్నదా అని అనిపించక మానదు

దేశవ్యాప్తంగా అందఱు ఆచరించే ముఖ్యమైన పండగల్లో విజయ దశమి, దానికి ముందు వచ్చే నవరాత్రులు చాలా విశిష్టమైనవి వాటి విశిష్టతను నిరూపించడానికి మన వాఙ్మయంలో ఎన్నో ఆధారాలు కనపడుతున్నాయి చూడండి

హిందువులమైన మనం ప్రతి సంవత్సరం నవరాత్రోత్సవాలను జరు పుకొంటాం నవరాత్రం అంటే తొమ్మిది రాత్రులు ఈ సమయంలో పగటి పూట జరిగే పూజకంటే రాత్రిపూట జరిగే పూజకు ప్రాధాన్యం ఉంటుంది అందుకనే రాత్రిపదాన్ని చేర్చి నవరాత్రులు అనడం ఇవి నాలుగు విధాలుగా ఆచరింపబడుతున్నాయి

1 రామనవరాత్రాలు ఇవి చైత్రశుద్ధపాడ్యమి నుంచి శ్రీరామ నవమివఱకు జరిగేవి

2 దేవీనవరాత్రులు చైత్రశుద్ధ పాడ్యమి నుంచి తొమ్మిదిరాత్రులు దేవీనవరాత్రా లుగ్గా కొందఱు ఆచరిస్తారు వీటినే వసంతనవరాత్రాలని కూడ పిలుస్తారు

3 గణపతినవరాత్రాలు భాద్రపద శుద్ధ చవితి వినాయకచవితి

నుంచి తొమ్మిదిరోజుల ఉత్సవాలు

4 శరన్నవరాత్రాలు శరదృతువులో ఆశ్వయుజశుద్ధపాడ్యమినుంచి తొమ్మిదిరాత్రులు వరుసగా చేసే ఉత్సవమే ఇది దీన్నే దేవీనవరాత్రులు శారదనవరాత్రాలు అనడం కూడా ఉంది

అయితే పేరుకి నవరాత్రమనే వ్యవహారం అన్నింటికి ఉన్నా ప్రసిద్ధి ప్రాచుర్యాలను బట్టి నవరాత్రాలు అనే మాట చెవిన పడటంతోటే మనకు జ్ఞాపకానికొచ్చేవి దసరా అనే పేరుతో పిలవబడే శరన్నవరాత్రాలే కాబట్టి వీటి ప్రాముఖ్యం సమాజంలో అనాదిగా ఎంత వ్యాపించి ఉన్నదో మనం భావించవచ్చు దీనినే మనవాళ్ళు ఇలా చెపుతారు

ఆశ్వినే శుక్లపక్షే తు కర్తవ్యం నవరాత్రకమ్,
ప్రతిపత్ప్రమమాశ్రిత్య యావద్ధి నవమీ భవేత్

ఆశ్వయుజమాసంలో శుక్లపక్షంలో పాడ్యమి మొదలుకొని నవమి వఱకు తొమ్మిదిరాత్రులు నవరాత్రోత్సవాన్ని జరుపుకోవాలని దీని భావం

సామాన్యంగా ఈ నవరాత్రుల్లో దుర్గాదేవి పూజ చేయాలని రుద్ర యామళంలోను, దేవీపురాణంలోను చెప్పబడింది శ్రీవిద్యోపాసకులకు ఇది చాల ముఖ్యమైన కాలం అలాగే వైష్ణవాగమాలైన పాంచరాత్రవైఖానసాలు ఈ తొమ్మిది రాత్రులు వీరలక్ష్మ్యారాధనం చేయమని ఉపదేశిస్తున్నాయి వరుసగా తొమ్మిదిరాత్రులు చేసే అవకాశం లేనివాళ్లు తదియనుంచి ఏడురాత్రులు గాని, లేక పంచమినుంచి అయిదురాత్రులుగాని, లేదా సప్తమినుంచి మూడురాత్రులు గాని, చిట్టచివరకు అష్టమి, నవములలో ఒకరాత్రిగాని ఈ ఉత్సవాన్ని జరుపుకోవచ్చని భవిష్యపురాణం ఇలా పేర్కొంటున్నది—

త్రిరాత్రం వాపి కర్తవ్యం సప్తమ్యాది యథాక్రమమ్

నవరాత్రుల్లో దేవీపూజ చేసే ఉపాసకులు దేవీప్రభావాన్ని ఇలా వివరిస్తారు

విష్ణుశరీరోద్భవ అయిన మహామాయ దేవి మొదటి అవతారం ఈమె జీవులకు అజ్ఞానాన్ని కలిగిస్తుంది

ఈమె రెండవ అవతారం మహిషాసురమర్దిని ఈమెకే మహాలక్ష్మి అని కూడా పేరు మహిషాసురుణ్ణి భయంకరంగా సంహరించింది ఈ దేవి

మూడవ అవతారం మహాసరస్వతి ఈమె వాహనం సింహం కోపా

గ్నిచ్చుటలను కక్కే ఈమె ఫాలభాగంనుంచే కాళికాదేవి ఉద్భవించింది, చాముండ అని ఈమెకు బిరుదు రక్తబీజుణ్ణి, శుంభనిశుంభులను ఈమె సంహరించింది

నందుని ఇంట్లో పుట్టిన 'నంద' ఈమె నాల్గవ అవతారం, ఐదవ అవతారం రక్తదంతి కరువు కాటకాలు ఏర్పడ్డప్పుడు ప్రజలకు క్షుద్బాధలను, పండ్లను ఇచ్చి 'శాకంభరి' అనే పేరుతో ప్రసిద్ధి పొందింది దేవి ఆఱవ అవతారం

దుర్గుడనే రాక్షసుణ్ణి చంపి 'దుర్గ' అనే ప్రసిద్ధి పొందింది ఏడవ అవతారం మాతంగి ఎనిమిదవ అవతారం

అరుణుడనే రాక్షసుణ్ణి తుమ్మెదలతో చంపిన 'భ్రామరి' అనే అవతారం తొమ్మిదోది దేవి స్వరూపస్వభావప్రభావాలను గురించి, అవతారాలను గురించి మార్కండేయపురాణం చేసిన వివరణ ఇది ఇలా దేవీఉపాసకులు తొమ్మిదిరాత్రుల్లు దేవి తొమ్మిది అవతారాలను ఆరాధించడం, అలంకారాలద్వారా భక్తులకు తెలియజేయడం ఈ నవరాత్రాల్లో ముఖ్యంగా గమనించవలసిన విషయం

నవరాత్రాలలో దీక్షతో కలశస్థాపన చేసి దేవిని ఆరాధిస్తారు ఈ ఆరాధనావిధానాలు సాత్త్వికరాజసతామసభేదంతో మూడు రకాలుగా కనబడుతాయి.

1. అనుష్ఠానం, బ్రహ్మచర్యం ఉండి మధు మాంసాలు లేకుండా చేసే పూజ సాత్త్వికపూజ.

2 జపయజ్ఞాలున్నా మధుమాంసాలు నైవేద్యమైతే అది రాజసపూజ

3 జపయజ్ఞాలు లేకుండా మధుమాంసాలు నైవేద్యం చేసి చేసే పూజ తామసపూజ అవుతుంది

ఈ పద్ధతిలో దేవ్యావాహన చేసి తొమ్మిదిరాత్రులు దీక్షతో పూజలు చేసి పదవరోజు దశమినాడు దేవికి ఉద్వాసన చెప్పడమన్నది సంప్రదాయం

ఈ నవరాత్రాలలో మూలానక్షత్రంలో సప్తమిన సరస్వతీపూజ చేసి, దేవ్యావాహనం చేసి, పూర్వాషాఢానక్షత్రంలో మహాష్టమి రోజున సాంగంగా ఆరాధించి, ఉత్తరాషాఢానక్షత్రంలో మహానవమి రోజున బలి ఇచ్చి, శ్రవణనక్షత్రంలో విజయదశమినాడు ఉద్వాసన జరపడం అనూచానంగా వస్తున్న సంప్రదాయం దీన్ని ధర్మసింధువు ఇలా వివరిస్తోంది

మూలేన స్థాపనం దేవ్యాః పూర్వాషాఢాసు పూజనమ్,

ఉత్తరాసు బలిం దద్యాత్ శ్రవణేన విసర్జయేత్

సాత్త్వికపూజ చేసే వాళ్లు గుమ్మడికాయలతో బలి ఇవ్వడం ఆచారంలో కనబడుతుంది

మహానవమి అనే ఈ పదం అలా అలా అపభ్రంశమై వ్యవహారంలో "మహర్నవమి" గా తయారైంది

ప్రాచీనకాలంలో మహానవమినాడు క్షత్రియులు ఛత్రచామరాది రాజ చిహ్నాలను, వాహనాలను, ఆయుధాలను పూజించేవారని తెలుస్తున్నది మరునటిరోజైన విజయదశమినాడు సీమోల్లంఘనం చేసి దిగ్విజయయాత్రలకు బయలుదేరేవారు కాబట్టి అలా పూజ చేయుటంలో ఎంతైనా ఔచిత్యం కనబడుతుంది దీన్నే ఆనాడు "లోహాభిసారికం" అని అనేవారు ఇప్పుడు మనం "ఆయుధపూజ" అనే పేరుతో మన ఇంట్లో వస్తువులన్నిటిని పూజిస్తున్నాం చూడండి ఆలోచన- ఔచిత్యం లేకుండా గతానుగతికంగా ఎన్ని పనులు జరుగుతుంటాయో!

ప్రస్తుతం మనం నవరాత్రాల్లో దేవీపూజలు చేస్తున్నాం ఈ దేవిని ఆరాధించడం ఎలా మొదలైంది? వైదికవాఙ్మయం దీన్నిగురించి ఏం చెప్తున్నదని ఆలోచిస్తే వేదబ్రాహ్మణఉపనిషద్గ్రంథాలలో ఎన్నో విషయాలు మనకు గోచరిస్తాయి అతిప్రాచీనకాలంలోనుంచి గూడ భగవంతుణ్ణి పురుషరూపంగా భావించడంతో పాటు స్త్రీరూపంగా శక్తి స్వరూపిణిగా ఆరాధించడం కూడా మనకు కనపడుతుంది అందుకనే మన సంప్రదాయాల్లో శాక్తసంప్రదాయం కూడా ఒకటిగా పరిగణింపబడుతోంది

ఋగ్వేదంలో రాత్రిసూక్తం, దేవీసూక్తం, అలాగే అథర్వవేదపరిశిష్టం కూడా దేవీప్రశంసాపరమైనవే అథర్వవేదపరిశిష్టాన్నే దేవ్యథర్వశీర్షం అంటారు ఇందులో 'ప్రకృతిపురుషాత్మకమైన ఈ ప్రపంచం వల్లనే పుట్టిందని" దేవి స్వయంగా చెప్పినట్లున్నది

శతపథబ్రాహ్మణంలో త్ర్యంబకయాగం వర్ణింపబడింది అందులో అంబికాదేవి రుద్రుడికి సోదరిగా చెప్పబడింది దుర్గాగాయత్రిగా తరువాతి కాలంలో ప్రచారంలో వచ్చిన

కాత్యాయనీ చ విద్మహే కన్యాకుమారి ధీమహి
తన్నో దుర్గిః ప్రచోదయాత్

అనే మంత్రం తైత్తిరీయారణ్యకంలో మనకు కనపడుతుంది కేన- మాండూక్యోపనిషత్తుల్లో ఉమ, కాళి, కరాళి మొ దేవీరూపాల ప్రస్తావన ఉంది స్మృతుల్లోను, పురాణాల్లోను దుర్గ తామసదేవతగా అభివర్ణింపబడింది రురుడనే రాక్షసుని పుత్రుడు దుర్గుడు అతణ్ణి

సంహరించడం వల్ల దేవి దుర్గ అయినట్లు స్కాందపురాణంలోని కాశీఖండం వివరిస్తున్నది మొత్తంమిద వేదాలనుంచి ఆధునికసాహిత్యంవఱకు ఏదో రూపంలొ దేవి ఉపాసన మనకు స్పష్టంగా కనబడుతున్నది

దేవి ఉపాసన భారతదేశానికి మాత్రం పరిమితం కాక మెసపు టేమియా, బెలూచిస్తాన్ , ఇరాన్, ఈజిప్టు, పాలస్తీనా, సైప్రస్, క్రీట్, బాల్కన్ దేశాలలో గూడ వ్యాపించినట్లు తెలుస్తున్నది

ఇక సమాజదృష్టితో ఆలోచించినా నవరాత్రాలు మనలో నూత నచైతన్యాన్ని కలిగిస్తున్నాయని, మన ఇండ్లకు కొత్తకొత్త శోభలను సంతరిస్తున్నాయని చెప్పక తప్పదు తోటివారితో కలసి మెలసి ఎన్నో మంచి పనులు చేస్తూ, సహజీవనమార్గంలో దేశానికి శాంతిసౌభాగ్యాలను సంపాదించడానికి ఇవి మంచి అవకాశాన్ని కలిగిస్తున్నాయని మనకంద ఱకు తెలిసిన విషయమే దసరాపండుగ వస్తుందని ముందే గృహిణులు ఇంటెని అన్ని రకాల అలంకరిస్తారు మంచి మంచి బొమ్మలను సంవత్సరం పొడుగునా సంపాదించిన వాటిని చక్కగా తమ తమ అభిరుచులకు తగినట్లు అమర్చి బొమ్మలకొలువు తయారు చేస్తారు ఈ బొమ్మల కొలువులలో స్త్రీల ఆలొచనాశక్తి, చిన్న పిల్లల అభిరుచులు చక్కగా ప్రతిబింబిస్తాయి ప్రతివారు పేరంటాండ్రను పిలచి వారితో కలసి కాలక్షేపం చేసి వారిని ఫలపుష్పాలతో గౌరవించి పంపుతారు ఈ నవరాత్రాలలొ స్త్రీలలొ ఉన్న లలితకళానైపుణ్యం చక్కగా ప్రకాశించ డానికి అవకాశం ఉంటుంది పిల్లలు ఉత్సాహంగా, ఉల్లాసంగా, మన సంస్కృతిలొ ఉండే గొప్పదనాన్ని తమ పెద్దల ద్వారా తెలుసుకోవడానికి ఇది గొప్ప అవకాశాన్ని కలిగిస్తుంది

నవరాత్రాలు అయిన మఱునటి రోజు విజయదశమి నవరాత్రాలను విజయదశమినుంచి వేరుచేయడం అసంభవం నిజం ఆలోచిస్తే దేవీ ఉద్వాసనం ఆరొజు జరుగుతుంది, కాబట్టి విజయదశమితోనే వాటికి పరిపూర్ణత సిద్ధిస్తుందని తోస్తుంది

దేవి విజయాన్ని సాధించిన రోజు కాబట్టి విజయదశమి అనే వ్యవహారం ఏర్పడిందని కొందఱు విజయదశమిని నిర్వచిస్తారు ఆశ్వ యుజ శుద్ధదశమి సాయంకాలం నక్షత్రాలు పొడిచే వేళకు విజయమని పేరు దానితో కూడిన దశమి విజయదశమి అని ధర్మశాస్త్రాలు ఇలా చెబుతున్నాయి

ఆశ్వినస్య సితే పక్షే దశమ్యాం తారకోదయే,
స కాలో విజయో నామ సర్వకామార్థసాధకః

ఈషత్సంధ్యామతిక్రాన్తః కించిదుద్భిన్నతారకః,
విజయో నామ కాలోఽయం సర్వకార్యార్థసిద్ధిదః

ఇలాంటి పండుగల్లో పిండివంటలు తిని కొత్తబట్టలు కట్టుకోవటంతో మాత్రం తృప్తిపడకూడదు ఆ పండుగ విశిష్టతను [illegible] పెద్దలేం చెబుతారు? మన వాఙ్మయంలో దాన్ని [illegible] లేమయినా దొరుకుతాయా? అని విచారించి దాని విశిష్టతను తెలుసుకొని పిల్లలకు దాన్ని గురించి [illegible] తెలియచేయాలి లేక పోతే కొన్నాళ్లకు దాన్ని గురించిన వివరాలు [illegible] ప్రమాదం కూడా ఉంది విజయదశమి నాడు [illegible] తమ తమ ఇష్టదేవతల నారాధించుకొని, సాయంకాలం ఊరికి ఈశాన్యదిక్కులో పొలిమేర దాటి జమ్మిచెట్టును పూజించడం తప్పనిసరిగా [illegible] విధి ఈ జమ్మిపూజనే శమీపూజ అంటారు [illegible] పెద్దల కిచ్చి శుభాకాంక్షలను తెలిపి వారి ఆశీస్సులు [illegible] ఈ శ్లోకాన్ని పఠించడం పరిపాటి

శమీ శమయతే పాపం శమీ శత్రువినాశినీ,
అర్జునస్య(?)ధనుర్ధారీ రామస్య(?)ప్రియదర్శినీ

విజయదశమికి రామాయణభారతకథలకు గల [illegible] ఈ శ్లోకం ద్వారా తెలుసుకోవచ్చు ఇందులో ఉత్తరార్థం [illegible] ఉండేదేమో అనిపిస్తుంది

అర్జునశ్చ ధనుర్ధారీ రామశ్చ ప్రియదర్శన

శమీ అనే పదానికి ఈ పాఠానికి సంబంధం [illegible] భ్రమలో పాఠాన్ని మార్చినట్లు కనబడుతుంది కాని [illegible] నామైకదేశాన్ని 'విజయదశమి' పరంగా చెప్పుకుంటే [illegible] జరిగిన పై రెండు సంఘటనలు ఒకచోటికి రావడం [illegible] బంధంలోను అనౌచిత్యం ఆవంతైనా కనపడదు ఇలా చెప్పడంవల్ల చాలా అనౌచిత్యాలు పరిహరింపబడతాయి కాని ఆ విచారానికి ఇది సమయంకాదు

ఇప్పటికీ గ్రామాల్లో దేవాలయాల్లో శమీపూజ చేసి పై శ్లోకం వ్రాసిన పత్రికలను భక్తులకిచ్చి ఈ విజయదశమి పండుగ చేస్తే విజ

యదశమి వఱకు ఆ స్వామి అనుగ్రహంవల్ల క్షేమస్థైర్యవిజయాలు భక్తులకు కలగాలని శుభాకాంక్ష లందజేస్తుండడం మనం చూస్తుంటాం

విజయదశమినాడు శమీపూజ, సీమోల్లంఘనం చాలా ముఖ్యమైన అంశాలని ధర్మశాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నాయి విజయయాత్రలు చేసే రాజులకు విజయదశమినాడు బయలుదేరడం విజయప్రదం, అందుకనే శమీపూజ చేసి సీమోల్లంఘనం చేస్తే శమీ విజయాన్ని ప్రసాదిస్తుందనే భావంతో విజయదా శమీ 'విజయదశమి' అని కూడా పదాన్ని విరిచి చెప్తుంటారు

గోపథబ్రాహ్మణం విజయదశమినాడు విజయయాత్రల కుపక్రమించడం చాలా శ్రేయస్కరమని ఇలా వివరిస్తున్నది

> ఆశ్వీనస్య సితే పక్షే దశమ్యాం సర్వరాశిషు,
> సాయంకాలే శుభా యాత్రా దివా విజయలక్షణా
> ఏకాదశో మహా ముహూర్తో విజయః పరికీర్తితః,
> తస్మిన్ సర్వైః విధాతవ్యా యాత్రా విజయకాంక్షిభిః

అంతేకాకుండా విజయదశమిని వదిలిపెట్టి తరువాత విజయయాత్ర చేసిన రాజు విజయాన్ని పొందలేడని కూడా స్కాందపురాణం ఇలా చెబుతున్నది

> దశమీం యస్సముల్లంఘ్య ప్రస్థానం కురుతే నృపః,
> తస్య సంవత్సరం రాజ్యే న క్వాపి విజయో భవేత్

ప్రకృతిపరంగా కూడా వర్షాకాలనాటికి శరదృతువు ప్రారంభం కావడంవల్ల వాతావరణం రమణీయంగా ఉంటుంది నీటికి ఎక్కడా లోటుండదు మార్గాలు ప్రయాణాలకు అనుకూలంగా ఉంటాయి కాబట్టి ఆ రోజుల్లో యాత్రలకు విజయదశమి అనువైన కాలంగా నిర్ణయించి ఉండవచ్చు

విజయదశమినాడు క్షత్రియులు అపరాజితాపూజ చేయాలని ధర్మసింధులో ఇలా చెప్పబడింది- "అత్రాపరాజితాపూజనం, సీమోల్లంఘనం, శమీపూజనమ్"[13] ఋగ్వేదం నాటికే కూడా అపరాజితాపూజ చాలా ప్రసిద్ధిని పొందింది అపరాజిత అంటే పరాజయాన్ని పొందనిది అని అర్థం అర్థశాస్త్రంలో చాణక్యుడు అపరాజితతో పాటు అప్రతిహత, వైజయంత అనే దేవతలను కూడా పేర్కొన్నాడు పూర్ణనవమినాడు

గాని, విజయదశమి నాడు గాని అపరాజిత [illegible] క్షేమం
విజయం తప్పక లభిస్తాయని పురాణ [illegible]

యా పూర్ణానవమీయుక్తా తస్యాం పూజ్యాపరాజితా,
క్షేమార్థం విజయార్థం చ ప్రసిద్ధవిధినా నరైః

నవమీ శేషసంయుక్త దశమ్యామపరాజితా,
దదాతి విజయం దేవీ పూజితా జయవర్ధనీ

ఈ రోజుల్లో స్వాతంత్ర్యదినోత్సవం [illegible]
మనం చూసే సైనికవందనం అన్నారు విజయదశమినాడు [illegible]
ల్లోన్నో తార్కాణాలున్నాయి. దానినే [illegible]
అనేవాళ్లు రాజ్యపరిపాలకులు తమ సేనలోని [illegible]
లించి, వారి ఔత్సాహికకార్యక్రమాలను, [illegible]
అభినందించేవారు

చల్లని, తెల్లని, వెన్నెలను వెదజల్లే [illegible]
శుద్ధ పాడ్యమినుంచి నవమివఱకు జరిగే నవరాత్రాలు [illegible]
ప్రజలలో మహోత్సహాన్ని కలిగిస్తాయి అంతే [illegible]
ఆధ్యాత్మికంగా, సాంస్కృతికంగా కూడా మన [illegible]
అందించి క్షేమ - స్థైర్య- విజయాయురారోగ్యాలు, [illegible]
పుట్టినిల్లై పటిష్ఠమైన జాతిని నిర్మాణం చేసుకొవడానికి విజయదశమి
తో కూడిన ఈ నవరాత్రోత్సవాలు ఎంతో దోహదం చేస్తున్నాయని
[illegible] ఈ సందర్భాన్ని మన [illegible]
[illegible] భవ్యమైన మార్గంలో నడిపించడానికి
[illegible] భవిష్యత్తును సమకూర్చడానికి, నడుంకట్టి
దీక్ష వహించాలని, [illegible] చేయాలని, ప్రతివారుడు తప్పక సంకల్పించాలి.

[illegible] భవన్తు జయినస్సర్వే స్వకార్యేషు కృతాదరాః

# 8. పాతంజల యోగదర్శనం

భారతదేశం అతీంద్రియజ్ఞాననిధులైన మహాయోగులకు, నిరంతర తపస్సంపన్నులైన మహాతపస్వులకు పుట్టినిల్లు ఈ గడ్డలో పుట్టిన ప్రతివ్యక్తి, భౌతికమైన సిరిసంపదలకు, అశాశ్వతమైన భోగభాగ్యాలకు దాసుడు కాలేదు మంచి ఆదర్శంతో తన జీవితాన్ని నడుపుకుంటూ ఆత్మజ్ఞానాన్ని పెంపొందించుకొని, తత్త్వజిజ్ఞాస చేసి మాధవాభిముఖంగా పయనించినవాడే

దివ్యజ్ఞానసంపన్నులైన మహర్షులు తత్త్వజిజ్ఞాసతో ఎన్నో అంశాలను పరిశీలించారు అసాధారణమైన బుద్ధిబలాన్ని తపశ్శక్తితో సంపాదించారు కాలప్రభావంవల్ల రాబోయే తరాలవారిలో కలిగే బలహీనతలను అనాడే పసికట్టారు మన సంతతి ఇలా దుర్బలమౌతుందే అని ఎంతో జాలిపడ్డారు అంతటితో వారు ఊరుకోలేదు ఉగ్రమైన తపస్సుచేసి సామాన్యుల కందుబాటులో లేని గొప్పజ్ఞానాన్ని సంపా

దించారు మనకందఱకు ఉపయోగపడాలని ఆ జ్ఞానాన్ని గ్రంథస్థం చేశారు వాటినే దర్శనాలంటారు దర్శనమంటే తత్త్వజ్ఞానాన్ని సాధించే శాస్త్రమన్నమాట

ఈ దర్శనాలు ఆస్తిక - నాస్తిక భేదంతో రెండు రకాలు అందులో ఆస్తికదర్శనాలు సాంఖ్య-యోగ-పూర్వమీమాంసా- వేదాంత- న్యాయ-వైశేషికాలనే పేరుతో ఆరురకాలు అలా ఆరుదర్శనాల్లో పాండిత్యం కలవాణ్ణి ఆ రోజుల్లో షట్శాస్త్రపండితుడనే వాళ్లు

ఈ ఆరుశాస్త్రాల్లో యోగశాస్త్రాన్ని ప్రవర్తింపజేసిన వాడు పతంజలి మహర్షి అందుకనే దీన్ని పాతంజలయోగశాస్త్ర మంటారు క్రీ పూ 3వ శతాబ్దంలో ఇతడు జీవించి ఉంటాడని చారిత్రికుల ఊహ పాణిని సూత్రాలపై మహాభాష్యం వ్రాసింది కూడా ఈయనే అని అందఱి నిర్ణయం

యోగపదానికి చాలమంది చాలరకాలుగా అర్థవర్ణనం చేస్తుంటారు భావాతీతస్థితి అని కొందరంటే, కేవలధ్యానమని ఇంకొందరంటారు మఱికొందరు 'కలయిక' అని చెబుతారు జీవాత్మను పరమాత్మ దగ్గఱకు చేర్చడానికి ఉపయోగించే శాస్త్రమే యోగమని వారి అభిప్రాయం

ఈశ్వరుడు, ప్రకృతి, పురుషుడు అనే భేదంతో ప్రధానంగా ప్రపంచంలో మూడు తత్త్వాలున్నాయి అనాదికాలంనుంచి ఇవి కలసే ఉన్నాయి కాని పురుషుడు ప్రకృతిప్రభావంలో పడి తన వ్యక్తిత్వాన్ని, పవిత్రతను కోల్పోయాడు అలాంటి పురుషుణ్ణి ప్రకృతిబంధంనుంచి విడిపించడమే యోగశాస్త్రంయొక్క ముఖ్యోద్దేశ్యం ప్రకృతిబంధవిముక్తుడైన జీవుడు స్వరూపస్థితిలో ఉండిపోతాడు అదే ముక్తి అని వీరి సిద్ధాంతం

ఈ యోగదర్శనంలో నాలుగు పాదాలున్నాయి మొదటిది సమాధిపాదం, దీన్నే యోగపాదమని కూడా అంటారు రెండవది సాధనపాదం విభూతిపాదం మూడోది దీన్నే సిద్ధిపాదమంటారు నాల్గోది కైవల్యపాదం సుమారు 200 సూత్రాలను నాలుగు పాదాలుగా విభజించి ఈ శాస్త్రాన్ని ఉపదేశించాడు పతంజలిమహర్షి పాదం అంటే ఇక్కడ అధ్యాయ మన్నమాట

మొదటిపాదంలో యోగశాస్త్రానికి సంబంధించిన సిద్ధాంతాలు ఉపదేశింపబడ్డాయి యోగమంటే ఏమిటో, అది ఎలా కలుగుతుందో, ఈశ్వరు డంటే ఎవరో, చిత్తవిక్షేపరూపమైన అంతరాయం ఎలా

కలుగుతుందో చెప్పబడింది. తరువాత మనస్సును ఎలా ప్రసన్నం చేసుకోవాలో, సమాధి అంటే ఏమిటో వివరించబడింది.

రెండోదైన సాధనపాదంలో సామాన్యజనులు ఎలా ఈ యోగాన్ని సాధించాలో విస్తరంగా వివరింపబడింది. యమ-నియమ- ఆసన-ప్రాణాయామ- ప్రత్యాహార- ధారణా- ధ్యాన- సమాధుల్లనే అష్టాంగాల్లో ప్రత్యాహారందాకా ఈ పాదంలో నిరూపింపబడ్డాయి.

విభూతిపాదం మూడోది. ఇందులో ధారణ- ధ్యాన- సమాధుల నిర్వచనం చేసి, వీటిని సాధించడంవల్ల కలిగే సిద్ధులెలా ఉంటాయో వివరింపబడింది. జరిగినదాన్ని, జరుగబోయే దాన్ని తెలుసుకోవడం, పూర్వజన్మజ్ఞానం, ఇతరుల మనస్సులో ఏముందో గమనించడం, అదృశ్యమై పోవటం, దూరంలో విషయాలు గ్రహించడం, ఆకలి- దప్పిక లేకుండా చేసుకోవడం, పరకాయప్రవేశం, నీళ్లపైన నడవటం, ఆకాశంలోకి ఎగరటం, అణిమాదులను సాధించడం మొదలైన సిద్ధులు ఇందులో ముఖ్యమైనవి.

నాలోది కైవల్యపాదం. ఇందులో జీవునికి ప్రకృతిబంధవిముక్తి కలిగి కైవల్యాన్ని అంటే ముక్తిని ఎలా సాధిస్తాడో వివరింపబడింది.

ఇలా నాలుగు పాదాల్లో ఎంతో ప్రాయోగికమైన పద్ధతిలో యోగశాస్త్రం మానవుని లోపలి ప్రపంచాన్ని గురించి, దాన్ని స్వాధీనం చేసుకొని సుఖశాంతుల్ని పొందే మార్గాన్ని గురించి చక్కగా వివరిస్తున్నది.

# 9. ఉపనిషత్తులలో నైతికప్రమాణాలు

మనది పవిత్రమైన భారతదేశం ప్రపంచవాఙ్మయంలోని సర్వప్రథమ స్థానాన్ని అలంకరించిన తత్త్వభాండాగారాలుగా ప్రసిద్ధి చెందిన వేదాలు ఆవిర్భవించిన గడ్డ ఇది. మానవజాతి సంతరించుకున్న మహావిజ్ఞాన పుస్తకభాండాగారంలో ఋగ్వేదం మొట్టమొదటిదని పాశ్చాత్యమహర్షి మాక్స్‌ముల్లర్ ఇలా అంటున్నారు.

'Rgveda is the first book in the library of man'

లోకకల్యాణం కోసం కృష్ణద్వైపాయనుడు వేదాలను ఋగ్యజుస్సామాథర్వణాలుగా విభాగం చేసి వేదవ్యాసుడని ప్రసిద్ధిని పొందాడు. ప్రతి వేదం 1. సంహిత 2. బ్రాహ్మణం 3. ఆరణ్యకం 4. ఉపనిషత్తు అని నాలుగు భాగాలుగా ఉంటుంది. వీటిలో చిట్టచివర ఉండే భాగం కాబట్టి ఉపనిషత్తులు వేదాంతాలని పిలువబడ్డాయి.

ఉపనిషత్తు అనే పదానికి ఎన్నో అర్థాలున్నాయి. ఉప, ని అనే

రెండు ఉపసర్గలు ముందుగల సద్ ధాతువుకు క్విప్ ప్రత్యయం చేస్తే 'ఉపనిషత్' అనే శబ్దం ఏర్పడింది సద్ ధాతువుకు 1 విశరణం 2 గతి 3 అవసాదనం మూడు అర్థాలు విశరణం అంటే నాశం గతి అంటే పొందడం లేక తెలుసుకోవడం అవసాదనం అంటే శిధిలం కావడం బ్రహ్మవిద్యవల్ల అజ్ఞానం నాశనమౌతుంది బ్రహ్మసాక్షాత్కారం లభిస్తుంది దుఃఖాలు శిథిలమౌతాయి కాబట్టి బ్రహ్మవిద్యకే ఉపనిషత్తని పేరు కొందఱు ఉపనిషత్తు లంటే 'రహస్య' మని, 'ధార్మికసభ' అని కూడా అర్థనిర్వచనం చేస్తారు తపోనిధులైన మహర్షులు అరణ్యాల్లో చేసిన తాత్త్వికసమాలోచనలు ఆరణ్యకాల్లో మనకు లభిస్తున్నాయి ఒక్కొక్క శాఖలో కొందఱు మహర్షులు చేసిన ప్రపంచజీవతత్త్వాన్వేషణలే ఆరణ్యకాల్లో చోటుచేసుకొని ఉపనిషత్తులుగా గుర్తింపబడ్డాయి

నాలుగు వేదాల్లోను మనకు మొత్తం 245 ఉపనిషత్తులు లభిస్తున్నప్పటికీ, 108 ఉపనిషత్తులకు మాత్రమే వ్యాఖ్యానాలు దొరుకుతున్నాయి అందులో చాలా ముఖ్యమైనవి, ప్రామాణికమైనవీ పది ఉపనిషత్తులు-

**ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః,**

**ఐతరేయం చ ఛాన్దోగ్యం బృహదారణ్యకం దశ**

ఇవి దశోపనిషత్తులుగా ప్రసిద్ధాలు ఈ పది చాలా ప్రాచీనమైనవని, ఆధ్యాత్మికతత్త్వంలోని మూలసిద్ధాంతాలకు పుట్టినిల్లని సాంప్రదాయికుల భావన వీటిపై విభిన్నమతప్రవక్తల భాష్యాలు మనకు దొరుకుతున్నాయి

ఆధ్యాత్మికతత్త్వరత్నఖనులుగా పరంపరగా మనకు లభించిన ఈ ఉపనిషత్తుల్లో ఇహలోకానికి మానవజాతి మనుగడకు సంబంధించిన జీవనమూల్యాలెన్నో అక్కడక్కడా మహానుభావుల జీవితాలలో ఉపదేశవాగ్రత్నాలుగా ప్రకాశిస్తున్నాయి వీటిని విశ్లేషిస్తే ఆనాటి భారతీయుల్లోని ఆధ్యాత్మికశక్తి, నైతికబలం, ఆదర్శప్రవృత్తి, నిస్స్వార్థభావన- ఇలా ఇంకెన్నో ఉత్తమోత్తమలక్షణాలను మనం సందర్శించవచ్చు ఒక్కొక్క మహానుభావుని జీవితం నీతికి, నిజాయితీకి పట్టిన అద్దంలాగా మనకు ఉపనిషత్తుల్లో కనబడుతుంది ఆనాటి జీవనస్రవంతికి త్యాగం ఒక ఒఱవడిగా గోచరిస్తుంది అశాశ్వతమైన లౌకికసుఖలాలసను వదులుకోవాలని, జీవితాన్ని పరమాత్మకు అంకితంచేస్తూ శాంతితో ధర్మాభిముఖంగా నడుపుకోవాలనే దీక్ష కొట్టవచ్చినట్లు ప్రతిపదంలోను కనపడుతుంది జ్ఞానసంపాదనలో చిన్న, పెద్ద తేడాలు గాని, కులం సిరిసంపదలు,

అధికారం వీటికి ప్రాధాన్యంగాని, స్త్రీ-పురుషవిభేదాలు గాని, అనాడు పాటింపబడలేదన్న సత్యం సాక్షాత్కారమిస్తుంది అతిథులను గౌరవించడం అభ్యాగతులను సాక్షాత్తు హరిస్వరూపులుగా భావించడం అనాటివారికి బాగా అలవాటులో ఉన్న విషయం మానవుడిలో మాధవసందర్శనం చేస్తూ యథాశక్తి సమాజపరమేశ్వరుణ్ణి సేవించాలని, విశ్వవిరాట్‌పురుషుణ్ణి ఆరాధించాలనే తహతహ అనాడు చాలామందిలో కనబడుతుంది ఈ దృష్టితో ఆలోచించినప్పుడు ఉపనిషత్తుల్లో ఎన్నో కథలు, మరెన్నో ఉపాఖ్యానాలు వాటిలో సుభాషితాలు మానవుని నైతికజీవితానికి చక్కని ఉదాహరణలుగా, సముచితప్రమాణాలుగా, పసిడి అద్దాల్లోని ప్రతిబింబాలుగా నిలబడతాయి వాటిల్లో మచ్చుకు కొన్నింటిని ఇక్కడ ముచ్చటిస్తాను

ఉపనిషద్వాఙ్మయంలో కఠోపనిషత్తుకు చాలా ప్రముఖమైన స్థానం ఉంది అందులో అభివర్ణింపబడ్డ నచికేతుడు దయకు, పట్టుదలకు ఆదర్శంగా కనుపిస్తాడు నచికేతుని తండ్రి వాజశ్రవసుడు విశ్వజిద్యాగాంతంలో వట్టిపోయి, నీరసించి, కదలలేకుండా ఉన్న ఆవులను తండ్రి దానం చేయడం నచికేతుడు చూడలేకపోయాడు దయామాత ఆయన హృదయంలో తొంగి చూసింది 'నన్నెవరికి దానం చేస్తావు?' అని తండ్రిని గుచ్చి గుచ్చి అడిగాడు కోపంతో తండ్రి 'యముడి' కని చెప్పాడు యమసదనానికి పోయి నచికేతుడు యముడి ప్రలోభాలకు లొంగిపోకుండా పట్టుదలతో, ఆత్మజ్ఞానాన్ని వరంగా కోరుకొని ఉపదేశం పొందుతాడు

ఈ కథాభాగంలో మనకు అతిథిభక్తివిషయంలో యమధర్మరాజు ప్రవృత్తి, దయ, లక్ష్యశుద్ధి విషయంలో నచికేతుని నడవడి ప్రశంసింపదగ్గ ప్రమాణంగా నిలబడతాయి

ఉపనిషత్కాలం నాటి మహాత్ముల ఆదర్శజీవితాల రూపురేఖలను, అనాటి నైతికవిలువలను ఛాందోగ్యోపనిషత్తు నిరూపించినంతగా ఏ ఇతర ఉపనిషత్తు నిరూపించలేదనడం ముమ్మాటికీ స్తవం కాదు వాస్తవం ఇందులో అప్పటి సమాజంలో అన్నిరంగాల్లోను ఉత్తమశ్రేణికి చెందిన మహాత్ములు, ఉజ్జ్వలమైన వారి జీవితాలతో మనకు సాక్షాత్కారమిస్తారు అనాటి మానవజీవితం ఎంత నిరాడంబరంగా, కర్తవ్యోన్ముఖంగా సాగేదో మనకు కన్నులకు కట్టినట్లు అందులో కనబడుతుంది

మహావృషసామ్రాజ్యాన్ని పాలించే జానశ్రుతి అపారమైన దానధ

ధర్మాలు చేసి అద్వితీయమైన కీర్తిప్రతిష్ఠలు సంపాదించాడు. అతడు ఒక
సాయంకాలం ప్రాసాదాగ్రభాగంలో విశ్రమించి హంసల జంట మాటల్లో
తనకంటే రైక్వుడనే వాడు చాలా గొప్పవాడని తెలుసుకుంటాడు.
తాను రాజువనీ, అతడు బండితోలేవాడనే భావం లేకుండా, విరక్తుడు,
ప్రశాంతస్వరూపుడైన రైక్వుని సమీపించి, ఎన్నో విలువైన కానుకలు
సమర్పించి ఆనందప్రదమైన తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించమని అర్థిస్తాడు.
రైక్వుడు "ఈ కానుకలతో ఆత్మజ్ఞానాన్ని కొందామనుకున్నావు ఈ
వస్తువులు బయట ఎంత విలువగలవైనా నా దృష్టిలో వీటికి విలువ
లేదు," అని వైరాగ్యసౌరభాలు గుబాళించే మాటలతో తిరస్కరించి
పంపుతాడు. జానశ్రుతి రైక్వుని వైరాగ్యానికి విభ్రాంతుడౌతాడు.
ఇంకొకసారి నిరాడంబరంగా వెళ్లి రైక్వుణ్ణి ఆశ్రయించి ఆత్మజ్ఞానాన్ని
పొందగలుగుతాడు.

తత్త్వజ్ఞానాన్ని పొందడానికి అనాడు ఏ అడ్డుగోడలు లేవని, సమాజంలో
జ్ఞానానికే ప్రాధాన్యం కాని అధికారాలకు, ఐశ్వర్యాలకు
ప్రాముఖ్యం లేదని, విరాగులకు [illegible] రాజులు కూడా దాసోహమన్న రోజులు
అవి అని మనకు ఈ ఉదంతం తెలియజేస్తుంది.

ఛాందోగ్యోపనిషత్తులో శిష్యుడు, సత్యనిరతుడు, గురువాజ్ఞాపరిపాలనకు
ప్రతీకంగా నిలబడే సత్యకామజాబాలివృత్తాంతం కూడా మనకు కనిపిస్తుంది.
అతడి సత్యనిష్ఠకు ప్రకృతి పరవశిస్తుంది. గురువుగారి
ఆదేశానుసారం గోపరిపాలన చేస్తున్న సత్యకాముడికి అరణ్యంలోని
ఆబోతు, అగ్నిదేవుడు, హంస బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించిన ఉదంతం
మనకెంతో స్ఫూర్తిదాయకంగా ఉంటుంది.

గర్గవంశంలో పుట్టిన బాలాకి బ్రాహ్మణయువకుడు. తను చాలా
గొప్పవాడినని, అన్ని విషయాలు తనకు తెలుసుననీ అతడికి అహం
కారం ఏర్పడింది. అతడు అజాతశత్రువనే రాజుకు బ్రహ్మతత్త్వం
ఉపదేశించడం ప్రారంభించాడు. కానీ అజాతశత్రువు వేసిన ప్రశ్నలకు
నిలవలేకపోయాడు. తనకు తెలిసింది అంతేనని ఒప్పుకొని ఆ రాజునే
ఉపదేశించమని ప్రార్థించాడు. ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నాడు. బాలాకికి
గర్వం పటాపంచలైంది. అజ్ఞానపు తెర తొలగిపోయింది. అహంకారం
అంతర్థానమైంది. క్షత్రియుడు బ్రాహ్మణయువకునకు ఆత్మతత్త్వాన్ని
ఉపదేశించిన ఈ బృహదారణ్యకవృత్తాంతం ద్వారా కులవైషమ్యాలు
లేక జ్ఞానానికి గౌరవమిచ్చిన పవిత్రమైన సమాజం అది అని మనం

ప్రమదితవ్యమ్ కుశలాన్న ప్రమదితవ్యమ్ భూత్యై న ప్రమదితవ్యమ్ స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్ మాతృదేవో భవ పితృదేవో భవ ఆచార్యదేవో భవ అతిథిదేవో భవ యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి యాన్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యాని నో ఇతరాణి (తైత్తి 1 11)

వేదాన్ని అధ్యాపనం చేసిన తరువాత శిష్యుడి వినయవిధేయతలకు, కర్తవ్యనిరతికి మెచ్చి ఉప్పొంగిన ఆనాటి గురుహృదయం ఇలా ఉపదేశ ప్రవాహో న్నతడి కందిస్తూ సాగిపోతున్నది నీవు సత్యమే పలుకు ధర్మాన్నాచరించు అధ్యయనం చేసిన నీ వేదశాఖను మరచిపోకు ఆచార్యుని కిష్టమైన ధనాన్ని దక్షిణంగా సమర్పించి సంతానరూపమైన మానవ జాతిపరంపరను విచ్ఛిన్నం చేయకుండా గృహస్థాశ్రమంలో అడుగుపెట్టు గృహస్థాశ్రమంలో అడుగు పెట్టిన తరువాత నీవెన్నో సమస్యల నెదుర్కొంటావు అయినా స్థిరచిత్తంతో ఉండి, సత్యాన్నుంచి భ్రష్టుడవు కాకు ధర్మాచరణాన్ని వీడకు క్షేమాన్ని మరచిపోకు భౌతికసంపదల కోసం పాకులాడకు చదివిన వేదాన్ని జ్ఞాపకం పెట్టుకొని శిష్యుల కుపదేశించడం మానకు దేవతలకు, పితృదేవతలకు సంబంధించిన కర్మలను సక్రమంగా నిర్వహించు తల్లిని దేవతగా ఉపాసించు తండ్రిని దేవుడిగా గౌరవించు ఆచార్యుణ్ణి దైవంగా సేవించు అతిథిని భగవంతుడిగా ఆరాధించు తప్పులేని పనులు మాత్రమే ఆచరించు ఇతరవ్యవహారాల జోలికి పోకు మా ఆదర్శప్రవర్తనలను మాత్రమే అనుసరించు ఇతరమైన వాటి జోలికి పోకు ఇది సంగ్రహంగా బ్రహ్మచారుల కానాడు విద్యాభ్యాసంగం పూర్తిచేసిన తరువాత గురువు లందించిన సదుపదేశం అది నాటికీ నేటికీ నిత్యసత్యాలను అందిస్తూ వసివాడని భవ్యోపదేశం జ్ఞానాన్ని సంపాదించిన విద్యార్థి నైతికంగా పెరిగి ఈ దేశంలో ఒక యోగ్యుడైన పౌరుడై, ఆదర్శజీవనం గడపటానికి నిజంగా ఇది ఒక అమృతోపదేశం అనవచ్చు

లోకంలో మానవుడు బద్ధుడు కావటానికిగాని, ముక్తుడు కావటానికి గాని అతడి మనస్సే మూలకారణం మన భారతీయవాఙ్మయమంతా మానవుడి మనస్సును మార్చడానికి, సరియైన దోవలో దాన్ని నడిపించడానికి ఎన్నోరకాల ప్రయత్నాలు చరిత్ర కందని కాలంనుంచి చేస్తున్నది

ఈ విషయాన్నే ఇలా బ్రహ్మబిందూపనిషత్తు సుస్పష్టం చేస్తోంది

మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః,
బన్ధాయ విషయాసక్తం ముక్తం నిర్విషయం స్మృతమ్

[బ్ర బిం ఉ 2]

పూర్వార్ధం లోకంలో చాలా ప్రసిద్ధం అనేకానేకబలహీనతలకు లోబడి, ఆకర్షణలకు గురైన మనస్సు ఇక్కడే బంధింపబడుతుంది ఏ బలహీనతలకు లొంగిపోక విషయవాంఛలకు గురికాకుండా వాటికి అతీతంగా ఉండే మనస్సు విముక్తిని పొందుతుంది కాబట్టే మానవుడు సంసారబంధాలనుంచి విముక్తుడు కావాలంటే, మనస్సును స్వాధీనపరచుకోవాలనే నీతి ఇక్కడ మనకు చక్కగా అనుభవంలోకి వస్తోంది

మనకు సంసారం చిత్తంవల్లనే కలుగుతుంది జీవితం శాంతిగా ఉండాలంటే ఆ మనస్సు పరిశుద్ధంగా ప్రసన్నంగా ఉండాలి ఎందుకంటే మనస్సు దేనిపై ఆసక్తమై ఉంటే మానవుడు దానిలో లీనమౌతాడు కాబట్టి చిత్తశోధ చేసుకోగలిగితే చిత్తక్షోభ వాడికి కలగదనే నీతిని మనకు ఇలా అందంగా అందిస్తుంది మైత్రేయ్యుపనిషత్తు

చిత్తమేవ హి సంసార స్తత్ప్రయత్నేన శోధయేత్,
యచ్చిత్తస్తన్మయో భవతి గుహ్యమేత త్సనాతనమ్
చిత్తస్య హి ప్రసాదేన హన్తి కర్మ శుభాశుభమ్,
ప్రసన్నాత్మా౽౽త్మని స్థిత్వా సుఖమవ్యయ మశ్నుతే

[మై ఉ 1 5-6]

మానవుడికి అహంకారం, ధనం, అజ్ఞానం, ఆశ వీటివల్లనే ఎన్నో చికాకులు ఏర్పడుతున్నాయి వీటిల్లో ఏ ఒకటి తగ్గినా అతడి జీవితం శాంతికి అభిముఖంగా సాగుతూ ఉంటుంది ఇవి సామాన్యంగా వీటిని వీడిపోవు ఇవన్నీ ఉన్నాయి కాబట్టే అతడు సంసారి ఔతాడు కుటుంబంలో కొడుకు, తమ్ముడు, గృహం, గృహిణి ఉన్నట్లే ఇవికూడా ఉన్నాయని వీటిని వదలనంతకాలం మోక్షం లభించదని ఈ బాధలు తగ్గవని మైత్రేయ్యుపనిషత్తు చక్కని రూపణప్రక్రియలో వీటిని ఇలా పొందుపరుస్తున్నది చూడండి-

అహంకారసుతం విత్తభ్రాతరం మోహమన్దిరమ్,
ఆశాపత్నీం త్యజేద్యావత్తావన్ముక్తో న సంశయః

మోహమనే భవనంలో విత్తమనే సోదరునితో ఆశ అనే భార్యతో

కాపురం చేస్తే అహంకారసుతుడు ఉద్భవిస్తాడు ... ముక్తి ఎలా లభిస్తుంది?

'ఈ సమాజంలో ఎందఱో పెద్ద పెద్ద ధన... సంవత్సరాలు జీవించి అనుభవాన్ని గడించుకున్న వ... గురుకులక్లేశాన్ని అనుభవించి ఎన్నోరకాల విద్య... ద్ధులున్నారు కాని వీరందరు తత్త్వజ్ఞానసముపా... లైనవారికి, వారి శిష్యులకు కూడ సేవకుల్లాంటివా... మైత్రేయ్యుపనిషత్తు నిజానికి జ్ఞానంకంటే పవిత్ర... మరొక టేముంది? కనుక జ్ఞానవృద్ధుల సమక్షంలో, గొప్పవారైనా దాసోఽహమనవలసిందేననే నీతి ఇక్క... తెలుస్తున్నది

ధనవృద్ధా వయోవృద్ధా విద్యావృద్ధాస్తథైవ చ,
తే సర్వే జ్ఞానవృద్ధస్య కింకరాః శిష్యకింకరాః

మానవుడి మనస్తత్త్వం తనను, తన ప్రయత్... లోకం యావత్తు ఎప్పుడూ ఎన్నో రకాలుగా ప్ర... వాపోవడం కానీ, ఎవరైనా పొరబాటున తన... తక్కువగా మాట్లాడితే తోకతొక్కిన తాచులాగా లే... ఇతరులను నిందించి నీరసపడి పోవడం కానీ, ఇది ... మానవుడి కుండవలసిన పద్ధతి కాదు ఎవరైనా త... ప్రశంసించినా, విషాన్ని చూచి భయపడి పారిపో... ఉండాలి అమృతాన్ని ఎల్లప్పుడు ఆకాంక్షించి... విమర్శలకు అవమానాలకు స్వాగతం పలకాలి ... మానవుడు చేరగలిగితే అతడు తాను శాంతిని పొం... నికి కూడ శాంతి నందించగలడు ఈ నీతిని నా... ఇలా చక్కగా ప్రతిపాదిస్తున్నది-

సమ్మానాద్ బ్రాహ్మణో నిత్యముద్విజేత విషాది...
అమృతస్యేవ చాకాంక్షే దవమానస్య సర్వదా

కామినీకాంచనాలకు లొంగని పరమహంసలు ... విరళంగా ఉంటాయి ఆ రెంటిలో మొదటిదైన ... పన్నిన రంగుల వల ఆకర్షణీయమై అన్ని హంస... వలలో నరవిహంగాలన్నీ చిక్కక తప్పదు కన... కాంతావాగురలో పడవద్దని పురుషశకుంతాలను మం...

నీతి యాజ్ఞవల్క్యోపనిషత్తులో మనకు కనపడుతుంది చూడండి

**కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసః,**
**నార్యో నరవిహంగానా మజ్గబంధనవాగురాః**

నేటి సమాజంలో చాలామంది సిరిసంపదలున్నా, అధికారాలున్నా రూపయౌవనాదిసంపదలున్నా, విద్యావైదుష్యాలున్నా, తగినంత జనబలం ఉన్నా తృప్తితో, శాంతితో జీవితాన్ని గడపి, ఇతరులకు ఆదర్శంగా ఉండి తమ జీవితాన్ని కృతార్థం చేసుకోలేకపోతున్నారు ప్రకాశింపచేసు కొలేక పోతున్నారు ఎలా ఉంటే ఇది సులభమౌతుందనే ప్రశ్నకు సమాధానంగా బృహత్సన్న్యాసోపనిషత్తు ఒక మంచి నైతికప్రమాణాన్ని అందిస్తున్నది చూడండి

**యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,**
**యః సమః సర్వభూతేషు జీవితం తస్య శోభతే**

ఎవరికి అహంకారముండదో, ఎవరి బుద్ధి కర్మబంధాన్ని పొందదో, చరాచరజీవరాసులలో ఎవరికి సమభావన ఉంటుందో అతడి జీవితం గొప్పగా ప్రకాశిస్తుంది అందరకు ఆదర్శమౌతుంది

మానవజీవితాన్ని తీర్చిదిద్దే నైతికవిలువ లెన్నో ఈ ఉపనిషత్పయో ధిలో రత్నరాసులుగా మిల మిల మెరుస్తున్నాయి ఆ రత్నావళి గుండె లకెక్కేటట్లు చేసుకొని, హృదయంలో వెలుగు నింపుకొని, మానవజీవి తానికి ఒక ప్రయోజనాన్ని సాధించడం మన కర్తవ్యం

# 10. కాళిదాసు : ప్రకృతిపరిశీలన

ప్రకృతి ఒడిలోని అందాలకు తన మందారాలతో కొత్త సౌందర్యశోభల నందించే నందనవనంలో నవపారిజాతంలా సంస్కృతసాహితీనందనోద్యానంలో జన్మించి, సాహితీసౌరభాలతో దిగంతాలవఱకు వ్యాపించి అజరామరమైన యశశ్చంద్రికలతో విల్లసిల్లే సుందరహరిచందనమే మహాకవి కాళిదాసు ఈయన ఎప్పుడు ఎక్కడ పుట్టినా మన సాహిత్యానికి ఈయన చేసిన సేవ అపారమైనది ఉపమాలంకారప్రయోగంలో కాళిదాసు అద్భుతమైన ప్రతిభ కలవాడు ఈయన ప్రయోగించినన్ని ఉపమానాలు అంత అందంగా బహుశ ఇంకో కవి ప్రయోగించలేదనడం అతిశయోక్తి కాదు సంఖ్యలో మాత్రమే కాకుండా స్వరూపంలో కూడ ఈయన ఉపమలకు అవే సాటి కనుకనే కాళిదాసుని ఉపమానాలకు సాహితీలోకంలో అంత ప్రసిద్ధి లభించింది మంచి ఉపమాలంకారాన్ని చూడాలంటే కాళిదాసకావ్యాలనే చూడాలని సాహితీజగత్తులో 'ఉపమా కాళిదాసస్య'

అనే నానుడి కూడా ఏర్పడింది

సాధారణంగా ఇతరఅలంకారాల జోలికి అట్టె పోకుండా సరస మధురమైన ఉపమలతో కవితాకామినికి నిత్యయౌవనవిలాసాన్ని సంత రించి కాళిదాసు ఔచిత్యమూర్తిగా, కవికులగురువుగా సమ్మాన్యుడైనాడు ఆయన ఉపమానాలలో, లోకంలో నీరసంగా కనపడే ఎన్నో విషయాలు సరసంగా సహజసుందరంగా నవనవోన్మేషంతో మిలమిల మెరుస్తుం టాయి మాటలాడే శక్తి గల మహనీయమానవతాప్రకృతికన్నా, తన ముగ్ధమోహనసౌందర్యంతో స్వాధీనపతికలాగా విహాయసం వైపు చూస్తూ మనలో మకరందవాహినుల ప్రవహింపజేసే ప్రకృతిసుందరి ఆయన కావ్యాలలో ఉపమాలంకారభూషితగా ఒయారంగా కనపడుతుంది మన చుట్టూ, నదీనదాలలో, పర్వతశిఖరాలలో, ఉద్యానలతలలో, ఉన్నతసౌ ధాలలో, ఊహకందని విధంగా విలసిల్లుతున్నా ఆ మోహనాంగికి కాళిదాసు సమర్పించిన కమనీయోపమాలంకారాలను కొన్నింటిని తీసికొని పరిశీలిస్తాం

రఘువంశమహాకావ్యం కాళిదాసు ప్రథమరచన అందులో సుదక్షిణా దిలీపులు సంతానార్థులై కులగురువైన వసిష్ఠమహర్షిని సందర్శించడానికి వెడుతున్న సందర్భం వారిద్దఱి కలయికను కవి చక్కని ఉపమానంతో ఇలా వర్ణిస్తాడు

కావ్యభిఖ్యా తయోరాసీత్ వ్రజతోః శుద్ధవేషయోః,

హిమనిర్ముక్తయోర్యోగే చిత్రాచంద్రమసో రివ

వెన్నెలకన్నా తెల్లని వస్త్రాలను ధరించి, ప్రసన్నమైన హృదయంతో ఆ రాజదంపతులు కలసి గుర్వాశ్రమానికి వెడుతున్నారు వారిలో ఏదో నూతనోత్సాహం పరవళ్లు తొక్కుతోంది ఏవేవో కొత్త కొత్త ఆశలు కలుగుతున్నాయి అపుడు వారెంతో శోభతో కళకళలాడుతున్నారు ఇక్కడ కాళిదాసు ఒక మంచి ఉపమానాన్ని వారికి తగినట్లు పొందు పరచాడు శిశిరఋతువు గడచింది మంచుతెరలు వీడిపోయినాయి చైత్రమాసం నిండుపున్నమి పిండారబోసినట్లున్నది చక్కని చిక్కని వెన్నెల చంద్రుడు తారామణి చిత్రతో కలసి విచిత్రంగా వియన్మార్గంలో విహరిస్తున్నాడు వారిద్దఱి శోభ వర్ణనాతీతంగా ఉన్నది అలాగే ఇక్కడ సంతానంలేదనే బాధతో ఇన్నాళ్లూ దిగాలుపడి ఉన్న సుదక్షిణాదిలీపులు వసిష్ఠానుగ్రహంతో వంశకరు డుద్భవిస్తాడనే ఆశతో వెడుతూండడంవల్ల,

వారిలో ఆ నూతనోత్సాహం కనబడుతున్నది గురుసందర్శనయోగ్య మైన స్వచ్ఛవేషాలతో ఆశ్రమపదంలో ప్రవేశించనున్న వారు శిశిరం గడచిన తరువాత చిత్రాచంద్రుల్లాగా ఉన్నారనడం ఎంతైనా సమంజసంగా ఉన్నది చైత్రమాసంలో పున్నమినాడు చంద్రుడు చిత్రానక్షత్రంతో కూడి ఉంటాడనే జ్యోతిశ్శాస్త్రరహస్యం ఇక్కడ గర్భితమై ఉన్నది కనుకనే దాన్ని చైత్రమాసమని అంటారు

ఇంకొక సందర్భం చూడండి వసిష్ఠుని ఆదేశానుసారం సుదక్షిణా దిలీపులు గోసేవావ్రతాన్ని ప్రారంభించారు దిలీపుడు నందినీధేనువు వెంట అరణ్యంలో ప్రవేశించాడు అక్కడ కాళిదాసు కా వనం నంద నవనంగా కనబడుతుంది మహాకవుల భావనాబలాన్ని మనం అంచనా కట్టలేమేమో! ఇలా అంటాడు

మరుత్ప్రయుక్తాశ్చ మరుత్సఖాభం
తమర్చ్యమారాదభివర్తమానమ్,
అవాకిరన్ బాలలతాః ప్రసూనైః
ఆచారలాజైరివ పౌరకన్యాః

మునిహోమధేనువైన నందినిని సంరక్షించడానికి అరణ్యానికి వస్తు న్నాడు సమ్రాట్టు దిలీపుడు వెంట ఏ పరిజనులూ లేకుండా ఒంటరిగానే విజయం చేస్తున్నాడు ఆ వనంలోని ప్రకృతిలలామ చక్రవర్తికి స్వాగతం పలుకుతున్నది మత్తకోకిలల కుహూకుహూనాదాలతో అగ్నిహోత్రునిలా ధగ ధగ ప్రకాశిస్తున్నాడు దిలీపుడు అంతటి మహారాజు రాక రాక తమ దగ్గఱకొస్తున్నాడనే సంతోషంలో బారులు తీరిన బాలలతలకు వాయువు ప్రేరణకూడా లభించింది తనువు పులకరిం చింది పూజనీయుడైన ఆ రాజన్యున కు స్వాగతసుమాంజలులను సమర్పిస్తున్నాయి ఆ లతాకుమారికలు ఈ సందర్భంలో కవి చక్కని ఉపమానాన్ని ప్రయోగించాడు నగరవీధులలో మహారాజులు తరలి వెళ్లే సమయంలో నగరంలోని కన్యలు పేలాలను వారిపై వెదజల్లడం కాళి దాసునాటి సాంఘికాచారం అది చాలా మంగళకరం ఇక్కడ తన మిత్రుడైన అగ్నిహోత్రునిలాగా ప్రకాశించే దిలీపుని పైన, వాయువు ప్రేమతో బాలలతల శాఖాహస్తాల ద్వారా పూలను వెదజల్లిస్తున్నాడు ఇది ఆనాటి పౌరకన్యలు రాజులపై మంగళలాజలను చల్లినట్లున్నదనడం ఎంతో ఉచితంగా ఉన్నది ఇలా ప్రకృతి, దిలీపునకు స్వాగతం చెప్పడం

జరుగబోయే శుభానికి సూచకమని కూడా అనిపిస్తుంది చూడండి కాళి దాసు అనల్పమైన తన ఉపమానాలలో ఎంత మృదుమధురార్థబంధాలను అనుసంధిస్తున్నాడో!

ఇలాగే మఱొక సందర్భం- రఘుమహారాజు దిగ్విజయయాత్ర సాగి స్తున్నాడు అఖండమైన నౌకాబలం గల దేశం నాటికే వంగదేశం అంతటి నౌకాబలంగల వంగదేశపు రాజులను జయించి గంగానదీ ప్రవాహతీరాలలో తన జయస్తంభాలను నాటించాడు రఘుమహారాజు అక్కడ కాళిదాసు ఇలా అంటాడు

**ఆపాదపద్మప్రణతాః కలమా ఇవ తే రఘుమ్,**

**ఫలైః సంవర్ధయామాసుః ఉత్ఖాతప్రతిరోపితాః**

దిగ్విజయయాత్రాప్రసంగంతో వస్తున్న రఘువును వంగదేశపు రాజులు ఎదిరించి ఆయనతో యుద్ధం చేశారు అందులో వారిని ఓడించి పదవీభ్రష్టులను చేశాడు రఘువు వారిపై జాలిపడి తిరిగి వారి వారి రాజ్యాలలో తనకు సామంతులుగ వారిని నియమించాడు మొదట పదభ్రష్టులను చేసి తిరిగి సామంతులుగా నియమించడంతో ఉత్ఖాత ప్రతిరోపణక్రియలు జరిగినాయి వారు రఘుమహారాజుకు సామంతులు గనుక పాదపద్మాల కొగ్గి నమస్కరించి అనేకధనరాసులతో ఈయనను సేవించారు ఇక్కడ కవి ప్రయోగించిన ఉపమానం చాలా విశిష్టమైనది వరిపైరును మళ్లలో పోసి కొంచెం పెరిగిన తరువాత అక్కడనుంచి పీకి మళ్లా నాటడమనే వ్యావసాయికసత్యం ఇందులో చెప్పబడింది అలా నాటబడ్డ పైరు పెరిగి సస్యసంపన్నమై మళ్లా మన పాదాలపై ఒరిగిపడి మంచి పంటను మన కందిస్తుంది వంగదేశపు రాజులను కూడా కలమసస్యాల్లాగా ఉత్ఖాతప్రతిరోపణాల ననుభవించి ఆయనకు కప్పాలను చెల్లించారనడం ఔచిత్యభాసురంగా ఉన్నది దీనిని బట్టి మనకు కాళిదాసుకాలంనాటి వ్యావసాయికాభివృద్ధి ఎంతటి దనే విషయం స్పష్టంగా గోచరిస్తున్నది

అదే కావ్యంలో ఇంకొక సందర్భం- ఇందుమతీస్వయంవరానికి రఘు కుమారుడైన అజుడు విదర్భదేశానికి వెళ్లాడు అక్కడ రాజప్రాసాదంలో బసచేశాడు ప్రాతఃకాలంలో వందికుమారులు ఆయనకు సుప్రభాతం పలికి నిద్రలేపుతున్నారు ఈనాటి సుప్రభాతాల కన్నిటికి మూలమై సాహిత్యసుధల వర్షించే కొన్ని శ్లోకాలను కాళిదాసు ఎంతో చక్కగా ఇక్కడ సంతరించాడు అందులో ఒక శ్లోకం-

శయ్యాం జహత్యుభయపక్షవినీతనిద్రాః
స్తంబేరమా ముఖరశృంఖలకర్షిణస్తే,
యేషాం విభాన్తి తరుణారుణరాగయోగా
ద్భిన్నాద్రిగైరికతటా ఇవ దంతకోశాః

మదగజాలు రాత్రి తెల్లవార్లూ రెండు వైపులా పొర్లి బాగా నిద్రపోయి లేచినాయి ఘీంకారాలు చేస్తూ ఆలానస్తంభాలకు కట్టిన గొలుసులను గట్టిగా పట్టి లాగుతున్నాయి అప్పుడే భానుడు ఉదయించి తన ప్రయాణాన్ని సాగిస్తున్నాడు మదగజాల తెల్లని దంతకోశాలు, అరుణ రాగరంజితమైనాయి అనేకరంగుల్లో కనపడే గైరికాదిధాతువుల గట్లు, మంచుకొండలపైన పగిలితే ఎలా ఉంటాయో అవి అలా ఉన్నాయి తెల్లటి ఏనుగుదంతాల మీద ఎఱ్ఱని సూర్యకిరణాలు పడటం వల్ల, అది తెల్లని మంచుకొండల మధ్య ఎఱ్ఱని గైరికాదిధాతువుల గట్లు పగిలి బయటపడినట్లు కనపడుతున్నాయి అంటే ప్రస్తుతం సుప్రభాతకాల మైన దన్నమాట! అజుడు రాకుమారుడు గనుక శుభలక్షణమైన భద్రగజచిహ్నాలతో సుప్రభాతం పలకడం మెచ్చదగిన విషయం

కుమారసంభవం కాళిదాసుని రెండవ కృతి మేనకాహిమవంతులు పార్వతిని పుత్రికగా కని ధన్యజన్ములైనారు పార్వతి దినదినప్రవర్ధమా నయై హిమవంతునికే గాక లోకానికే అలంకారప్రాయమై భాసించింది ఆ సందర్భంలో మహాకవి కాళిదాసు రుచిరమైన మాలోపమ నిలా ప్రయోగించాడు

ప్రభామహత్యా శిఖయేవ దీపః
త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః, తి సంస్కారవత్యేవ గిరా
మనీషీ తి, తయా స పూతశ్చ విభూషితశ్చ

హిమవంతుడు తన పుత్రిక హైమవతిచే పవిత్రుడు, అలంకార యుతుడు అయినాడు జగజ్జనని పుత్రిక కావడంవల్ల అతడు పరమ పవిత్రుడైనాడు నిరతిశయరూపలావణ్య కుమారికయై ఇంట్లో ఉండ టంచేత విభూషితుడైనాడు ఈ మాలోపమలో కవి మూడు ఉపమానాలను మన కందించాడు ఉజ్జ్వలంగా ప్రకాశించే జ్వాలతో దీపంలాగా, మందాకినీప్రవాహం చేత స్వర్గమార్గంలాగా, వ్యాకరణాది సంస్కారసంస్కృత యైన శుద్ధవాక్కుచే విద్వాంసునిలాగా ఆ పార్వతీదేవి ద్వారా హిమవంతుడు పవిత్రుడై విభూషితుడైనాడు ఉపమానాలలో వైవిధ్యంతో పాటు పవిత్రత, విచిత్రత గోచరిస్తున్నాయి

ఈ కావ్యంలోనే ఇంకో సందర్భం తారకాసురుడు తనకు మించిన వాడెవడూ లేడనే అహంభావంతో దేవతలను వేధించసాగాడు ఆ బాధలు తట్టుకోలేక దేవేంద్రుని తీసికొని దీనులైన దేవతలందఱు బ్రహ్మ దేవుని వద్దకు వెళ్లారు అక్కడ వారికి బ్రహ్మ సాక్షాత్కార మిచ్చాడు ఈ సందర్భంలో కాళిదాసు సచమత్కారంగా ఇలా అన్నాడు

తేషామావిరభూద్బ్రహ్మ పరిమ్లానముఖశ్రియామ్,
సరసాం సుప్తపద్మానాం ప్రాతర్దీధితిమానివ

దేవతల ముఖాలు వాడిపోయి ఉన్నాయి ఈ తారకాసురుడి బాధలనుంచి ఎలా విముక్తి? అనేదే వారి సంతాపహేతువు అటువంటి అవస్థలో వారికి బ్రహ్మదేవుడు సాక్షాత్కార మిచ్చాడు కవి సమకూర్చిన ఉపమానం చూద్దాం "నిదురించే పద్మాలతో నిస్తేజస్కంగా ఉన్న సరస్సులకు ప్రాతఃకాలంలో సూర్యుడు సాక్షాత్కార మిచ్చినట్లు" అన్నది ఇక్కడ ఉపమానాంశం కమలాప్తుడు ఉదయిస్తే కమలాలు నిదుర మేల్కొంచి వికసిస్తాయి అపుడు పద్మసరస్సులు కళకళలాడుతాయి అలాగే ఇక్కడ దేవతలకు బ్రహ్మసాక్షాత్కారం వల్ల శక్తి, ఉత్సాహం, ఉపాయజ్ఞానం కలిగి తారకుని బాధలు తొలగిపోగలవని సూచించబడుతోంది

మేఘసందేశాన్ని రచించి సందేశకావ్యాలకు శ్రీకారం చుట్టిన మహాకవి కాళిదాసు విప్రలంభశృంగారప్రధానమైన ఈ కావ్యంలో ఆమ్రకూటమనే పర్వతాన్ని వర్ణిస్తూ ఇలా అంటాడు

ఛన్నోపాన్తః పరిణతఫలద్యోతిభిః కాననామ్రైః
త్వయ్యారూఢే శిఖరమచలః స్నిగ్ధవేణీసవర్ణే,
నూనం యాస్యత్యమరమిథునప్రేక్షణీయా మవస్థాం
మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తారపాండుః

'ఆమ్రకూటమనే పర్వతం నిండా పండ్లతో నిండిన మామిడిచెట్లు దట్టంగా ఉన్నాయి నల్లని జడరంగులో నున్న నీవు ఆ ఆమ్రకూటపు శిఖరంపై కెక్కినట్లైతే తప్పక దేవమిథునాలు ఆ పర్వతం మీదనున్న నిన్ను, పర్వతాన్ని చూస్తాయి' అని కవి ఇక్కడ ఒక ఉపమానం ప్రయోగించాడు చుట్టూ తెల్లగా, విస్తీర్ణంగా ఉండి మధ్యన మాత్రం నల్లగా ఉన్న పృథివి అనే నాయికయొక్క స్తనంలాగా మీరుభయులు కనబడతారు వసుంధర పర్వతస్తనమండల అనే ప్రసిద్ధి పైన చేసిన కల్పన ఇది కాళిదాసభావనాశక్తికి జోహారులు

మేఘసందేశంలోనే ఉజ్జయినీనగరవర్ణనం చేస్తున్నాడు కవి ఉజ్జయి

నీనగరానికి ప్రక్కనే చల్లని గాలులు వీచే శిప్రా అనే నది ఒకటుంది తెల్లవారుఝామున ఆ శిప్రానదినుంచి వీచే చల్లగాలి రాజహంసల పెద్ద పెద్ద కలకూజితాలను తనతోపాటు మోసుకుపోయి చాలాదూరం వినబడేటట్లు చేసి పొడవైన వాటినిగా చేస్తున్నది అప్పుడప్పుడే వికసించిన కమలాల సుగంధసంపర్కంతో కొంచెం వగరుగా తయారౌతున్నది ఇది ఆ ఉజ్జయినిలోని నాయికల శరీరాల కనుగుణంగా వీచి, రాత్రి కలిగిన బడలికను పోగొడుతుంది ప్రియుడొకడు ఒకసారి ప్రియురాలితో కలసి ఇష్టభోగాల ననుభవించాడు తిరిగి ఆమెతో కలయిక నభిలషిస్తున్నాడు ఆమెను ఒప్పించడానికి ఎంతో ఇష్టంగా మాట్లాడుతున్నాడు అతనిలాగా ఈ శిప్రామారుతం ఉందని ఇక్కడ కవి చెప్పిన ఉపమానం వినండి కాళిదాసశ్లోకం

దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః,
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మంగానుకూలః
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః

కాళిదాసమహాకవి రచించిన రూపకాలు మూడు అందులో "మాలవికాగ్నిమిత్రం" మొదటిది నాటకారంభంలో మిశ్రవిష్కంభకంలో నాట్యాచార్యుడైన గణదాసు ఇలా అంటాడు

పాత్రవిశేషే న్యస్తం గుణాన్తరం వ్రజతి శిల్పమాధాతుః,
జలమివ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోదస్య

వకుళావలిక వచ్చి గణదాసుతో మాళవిక నృత్యాభ్యాసాన్ని గూర్చి ప్రస్తావించింది యోగ్యమైన పాత్రలలో ఉంచబడిన శిల్పం శిల్పికి గొప్ప పేరుప్రతిష్ఠలను సమకూరుస్తుంది సముద్రంలో ఉన్న ముత్యపుచిప్పలో పడిన స్వాతిచినుకులు ముత్యాలౌతాయి ఆ గౌరవం మేఘానికి దక్కుతుంది అలాగే నిపుణ, బుద్ధిమతి అయిన మాళవికకు నేను నాట్యం నేర్పడం నాకు ప్రతిష్ఠావహమే అన్నాడు

ఇక్కడ కాళిదాసు తీసుకున్న ఉపమానం లోకప్రసిద్ధమైనది పయోదక్రియానైపుణ్యాన్ని ప్రశంసించడం గమనార్హం

కాళిదాసు మనకు బహూకరించిన రెండవ రూపకం విక్రమోర్వశీయము ఇందులో రెండవఅంకంలో ఒకచోట ఇలా అంటాడు

ప్రియవచనకృతోఽపి యోషితాం
దయితజనానునయో రసాదృతే,

ప్రవిశతి హృదయం న తద్విదాం
మణిరివ కృత్రిమరాగయోజితః

పట్టమహిషియైన కాశీరాజపుత్రి ఆగ్రహంతో వెళ్లిపోయింది అప్పుడు పురూరవుడు విదూషకునితో ఇలా అన్నాడు

లోపల ప్రణయం లేకుండా మెరమెచ్చులకు ప్రియులు ప్రియురాం డ్రను బ్రతిమాలవచ్చు కాని వారికవి చక్కగా తెలుస్తూనే ఉంటాయి ఈ అనుమానాలు వారి హృదయందాకా పోనే పోవు ఎలాగంటే-కృత్రి మంగా రాగాన్ని ఆరోపించిన మణిని, రత్నపరీక్ష చేయగలవాని ముందు పెడితే వాడు దానిని మెచ్చనట్లే అది మంచి రత్నమైతేనే వాడు మెచ్చుతాడు అంగనలు కూడా కృత్రిమానురాగాన్ని అట్టే పసికట్టి ప్రియులను దగ్గఅకు కూడా రానివ్వరు

చూడండి, ఈ ఉపమానం అనురాగరంజితమై ఎంత సహజసుంద రంగా ఉందో! కాళిదాసు ఇటువంటి వాటిని భావించడంతో అందెవేసిన చేయి

ప్రపంచనాటకసాహిత్యచరిత్రలో విప్రలంభశృంగారరసనిర్భరమైన నాటకం "అభిజ్ఞానశాకుంతలమే" కాని వేఱొకటి లేదని "నాటకేషు శకుంతలా" అనే ప్రసిద్ధిని పొందింది శాకుంతలం కాళిదాసమహా కవి ప్రతిభకు, ఔచిత్యస్ఫూర్తికి, భాషామాధుర్యానికి పట్టిన అద్దం ఈ నాటకం అనడంలో అతిశయోక్తి లేనే లేదు

శకుంతల తన చెలికత్తెలైన అనసూయాప్రియంవదలతో లేతమొ క్కలకు నీళ్లు పొస్తూ పుష్పవాటికలో ఉన్నది దుష్యంతుడు చెట్ల మాటునుంచి వారిని తొంగి చూస్తున్నాడు కేసరవృక్షందగ్గఱ శకుంతల నిలబడితే అది లతలో కూడినట్లు ప్రకాశిస్తున్నదన్నది ప్రియంవద దుష్యంతుడు ప్రియంవదను ప్రశంసిస్తూ అందుకే నీవు ప్రియంవదవ న్నాడు శకుంతల నిజంగానే లతలాంటిది దుష్యంతుని ద్వారా ఇలా అనిపిస్తున్నాడు కవి చూడండి

**అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ,**
**కుసుమమివ లోభనీయం యౌవనమంగేషు సన్నద్ధమ్**

జిగి బిగి కల చిగురుటాకులపై నుండే రాగమే ఆమె అధరం చాలా సున్నితమైన రెమ్మలవంటివి ఆమె బాహువులు అని చెప్పి ఆమె యౌవనాని కొక మధురమైన మృదులమైన ఉపమానాన్ని చెప్పాడు కాళిదాసు లతకు చిగుఋటాకులు , కొమ్మలు రెమ్మలు ఉన్నాయి

అంతమాత్రాన దాని సౌందర్యం పరిపూర్ణం కాలేదు మఱి ఇంకేం కావాలి? కమ్మని సౌరభాలను విరజిమ్మగల కుసుమం అలాగే ఎన్ని అందాలున్నా అవి యౌవనం లేనిదే శోభించవు అందరికి ఆకర్షణీయమైన తారుణ్యం అన్ని అవయవాలలోను చోటుచేసుకుంది మఱి ఇంకేం కావాలి? రసికభావుకులకు కాళిదాసు పెట్టిన విందుభోజనం కాదా యిది

కాళిదాసు ప్రకృతినెంత చక్కగా పరిశీలించి అర్థం చేసుకుంటాడన డానికి అదే నాటకంలో ఇంకొక నిదర్శనం

శకుంతలను చూచాడు దుష్యంతుడు ఉభయులకు పరస్పరం చక్షుః ప్రీతి కలిగింది ఇంతలో ధర్మారణ్యం పైన ఒక మదపుటేనుగు విరుచుకుపడింది ఎలాగో అతికష్టంమీద శకుంతల ఆశ్రమానికి వెళ్లలేక వెళ్లలేక వెళ్లింది నగరవిముఖుడైన దుష్యంతునిస్థితిని అతని ద్వారానే ఇలా వర్ణిస్తున్నాడు కవి చూడండి

గచ్ఛతి పురశ్శరీరం ధావతి పశ్చాదసంస్తుతం చేతః,
చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య

ఇది ద్వైధీభావస్థితికి ఉత్తమనిదర్శనం శరీరంమాత్రం ముందుకు పోతున్నది హృదయం శరీరంతో పరిచయం లేనట్లే శకుంతలాభిముఖంగా వెనుకకు పరుగెత్తు తున్నది ఇక్కడ కవి చేసిన ప్రకృతిపరిశీలన ఉచితమైన ఉపమానసన్నివేశం ద్వారా విశదమౌతున్నది గాలికెదురు వెడుతున్న జెండాలో కఱ్ఱ ముందుకు పోతుంటుంది జెండాకు వేసిన సున్నితమైన చీనాంశుకమో వెనుకకు ఎగురుతూ ఉంటుంది ఆ వడిలో మనస్సుకున్న ఉత్కంఠ గర్భితమై ఉంది ఆహా! ఎంత సముచితమైన కల్పన నిజంగా కాళిదాసు కవికులగురువే ఆయన కల్పనలు అజరామరాలు ఆయన భావనలు భావుకజనరససమారాధనలు ఆయన సృష్టించిన పాత్రలు ఆనందడోలికలలో అఖిలసహృదయలోకాన్ని ఉయ్యాలలూగించజాలిన కళాఖండాలు ఆయన ఉపమ నిరుపమ, అద్వితీయ ఆయన భాష, మధురమందస్మిత, తారుణ్యవిలాసినియైన ముగ్ధామోష అటువంటి మహాకవికి వారసులమైనందుకు మనమెంతో గర్వపడాలి

# 11. పాంచరాత్రంలో ప్రాణాయామం

ఆనందనిలయుడైన భగవంతుని చేరుకోవడానికి అనేకశాస్త్రాలు మన కనేకమార్గాల నుపదేశించాయి ప్రవర్తకులను బట్టి మార్గాలు భిన్నంగా ఉంటాయి కాని లక్ష్యం మాత్రం ఒక్కటే భారతభూమిలో విశేషంగా నాటికీ నేటికీ సగుణారాధన [విగ్రహారాధన] ఆచరణలో ఉంది దానిని చాలా శాస్త్రా లుపదేశిస్తున్నా అనాదిగా మానవజీవనవాహినిలో వ్యాపించి మనలను తీర్చిదిద్దుతూ భక్తిబద్ధులను చేస్తున్నది శ్రీ పాంచరాత్రశాస్త్రం దీని ప్రాచీనతను, పవిత్రతను అనుపమత్వాన్ని ఒక్క మాటలో చెప్పాలంటే శ్రీవైకుంఠవాసుడగు శ్రీమన్నారాయణునిచే ఇది ఉపదేశింపబడినదనటం చాలు సంసారవిషవలయంలో తగుల్కొని పెనుగులాడుతున్న జీవగణాన్ని చూచి జాలిపడి ఆయన ఈ శాస్త్రాన్ని ప్రవర్తింపజేశాడు కనుకనే ఈ రహస్యం "పాంచరాత్రం" అనే దాని పేరులోనే మహర్షులకాలంనుండి యిమిడి తన పవిత్రతను, ప్రాచీనతను

చాటి చెబుతోంది

దీనిలోని విషయం నాలుగు పాదాలుగా విభజింపబడి యుంటుంది జ్ఞాన-యోగ- క్రియా-చర్యా పాదములని వాటి పేర్లు ఇందులో నిఖిలశాస్త్రములకు మూలాధారములగు విషయాలు సంక్షిప్తంగా ప్రతి పాదింపబడ్డాయి ప్రస్తుత మీ శీర్షికలో యోగశాస్త్రంలో చెప్పబడిన విషయాలలో ముఖ్యమైన ప్రాణాయామాన్ని గూర్చి ప్రస్తావించబడుతుంది

యోగశాస్త్రానికి పాంచరాత్రానికి చాలా దగ్గఱ సంబంధం ఉన్న దనటంలో సందేహం లేదు ఈ శాస్త్రంలోని యోగపాదమంతా యోగశాస్త్రానికి మూలసిద్ధాంతంగా కనబడుతుంది ప్రతిసంహితలోను మౌలికత మనకు గోచరిస్తూనే యుంటుంది అయితే ప్రాణాయామానికి సంబంధించిన విషయాలు అధునాతనశాస్త్రాదుల్లో ఎలా ప్రస్తావింప బడ్డాయో విచారించి తరువాత పాంచరాత్రంలోని విషయములు నిరూ పించబడును

ప్రాణాయామశబ్దార్థం

మన శరీరంలో ప్రాణవాయు వెంత కాల ముందునో యంతవఱకు మనము జీవించియుందుము ఆ ప్రాణవాయువు మన శరీరమును విడచిపోవుటయే మరణమని చెప్పబడును [1]

విధాత మనలను సృష్టించినపుడు మన సుకృతదుష్కృతముల నను సరించి కొన్ని కోట్ల ఉచ్ఛ్వాసనిశ్వాసములను మన కాయుష్యముగా నిర్ణయించును ఆ శ్వాససంతతి పూర్తియైనంతనే మన అవతార మును పరిసమాప్తమగును మహర్షులకాలమునుండి మన పూర్వులవరకు సముచితాహారవిహారనియమములు పాటించిరి కనుకనే వారి జీవన ప్రమాణ మధికమైనది ప్రాణాయామాదులందు సిద్ధులగువారు వేల సంవత్సరముల కొలది జీవించియున్నట్లు మనకు చరిత్రలు చాటి చెప్పచు న్నవి సుఖదుఃఖాదిద్వంద్వముల కందుబాటులో లేక శ్వాసప్రశ్వాసముల గతిని నిరోధించుట ప్రాణాయామ మని పతంజలి యోగదర్శనమున వివరించియున్నాడు [2]

---

[1] యావద్వాయుః స్థితో దేహే తావజ్జీవనముచ్యతే,
మరణం తస్య నిష్క్రాంతిః తతో వాయుం నిరోధయేత్
హఠయోగప్రదీపిక p 42

[2] తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయోః గతివిచ్ఛేదః ప్రాణాయామః

కనుక ప్రాణానాం వా ప్రాణస్య [3] వా ఆయామః ప్రాణా యామః దేహములోని ప్రాణములను లేక ప్రాణమును నియమించుట ప్రాణయామ మనబడును

ప్రాణాయామవిభాగం

ప్రాణాయామము 1 రేచకప్రాణాయామము 2 పూరకప్రాణా యామము 3 కుంభకప్రాణాయామము అని ప్రధానముగ మూడు విధములుగా నుండును [4]

యాజ్ఞవల్క్యుని మతమున గ్రహించిన వాయువును కుంభించి నాసి కారంధ్రముల ద్వారా నిశ్శేషముగా బయటకు వదలి లోపల వాయువు లేకుండ మరల వాయువును పీల్చక నిరోధించిన నయ్యది రేచక ప్రాణా యామ మనబడును [5]

బయటనున్న ప్రాణవాయువు నాకర్షించి నెమ్మదిగ నాడులనన్నిటి నెయ్యది పూరించునో అది పూరక మను ప్రాణాయామము [6]

దేనియందు రేచకము గాని పూరకము గాని యుండదో నాసి కాపుటములందున్న వాయువు నిశ్చలముగ నెయ్యది ధరించునో అది కుంభకమను ప్రాణాయామము [7]

మఱియు కుంభకము 1 సహితము 2 కేవలమని రెండు

---

[యోగ 42-2]

[3] ప్రాణః స్వదేహజో వాయుః ఆయామస్తన్నిరోధనమ్' ఇతి గోరక్షానాథః

[4] ప్రాణాయామస్త్రిధా ప్రోక్తో రేచపూరకకుంభకైః see హ ప్ర 79-15

[5] నిష్క్రమ్య నాసావివరాదశేషం ప్రాణం బహిః శూన్యమివానలేన, నిరుధ్య సంతిష్ఠతి రుద్ధవాయుః స రేచకో నామ మహానిరోధః గోరక్షానాధుడు

[6] బాహ్యే స్థితం ప్రాణపుటేన వాయుమాకృష్య తేనైవ శనైస్సమంతాత్, నాడీశ్చ సర్వాః పరిపూరయేద్యః స పూరకో నామ మహానిరోధః గో నా

[7] న రేచకో నైవ చ పూర్వకోఽత్ర నాసాపుటే సంస్థితమేవ వాయుమ్,
సునిశ్చలం ధారయతే క్రమేణ కుంభాఖ్యమేతత్ప్రవదన్తి తద్జ్ఞాః

విధములు [8] సహితము 1 రేచకపూర్వకము 2 కుంభకపూర్వకమని రెండు విధములు [9] రేచకప్రాణాయామమునకు రేచకపూర్వకము నకు చెప్పదగినంత భేదము లేదు పూరక పూర్వక కుంభకమున సూర్యభేదనాది భేదములు గలవు

కేవలకుంభకము సిద్ధించువఱకు సూర్యభేదనాదిరూపమగు సహితకుంభకము నభ్యసింపవలెను సుషుమ్నానాడిభేదనానంతరము దానియందు శబ్ద మేర్పడినచొ అప్పుడు కేవలకుంభకము సిద్ధించును తదనంతరము సహితకుంభకములు పదిమార్లుగాని, ఇరువదిమార్లుగాని చేయవలెను సామర్థ్యమున్నచో కేవలకుంభకముల నెనుబదిమార్లకంటే నెక్కువగ జేయవలెను

రేచకమును పూరకమును వదలి సుఖముగా అనాయాసముగా వాయువును ధరించుటయే కేవలకుంభక మనబడును [10]

ఇంకను ప్రాణాయామము 1 కనిష్ఠ, 2 మధ్యమ 3 ఉత్తమ భేద ముచే మూడు విధములు కనిష్ఠప్రాణాయామమున చెమటలు పట్టును మధ్యమప్రాణాయామమున శరిరమంతయు కంపించును ఉత్తమ ప్రాణాయామమున ప్రాణము బ్రహ్మరంధ్రమును చేరును అపుడు దానిని బంధింపవలెను[11]

పూరకమునకు ఎనిమిది మాత్రలును, రేచకమునకు పదునాఱు మాత్ర లును, కుంభకమునకు ముప్పదిరెండు మాత్రలును శిశుప్రాణాయామమున నుండును పూరకమునకు పన్నెండు మాత్రలును, రేచకమున కిరువదినా లుగు మాత్రలును, కుంభకమునకు నలుబదియెనిమిది మాత్రలును మధ్యమ ప్రాణాయామమున నుండును పూరకమునకు పదునాఱుమాత్రలును, రేచకకమునకు ముప్పదిరెండు మాత్రలును కుంభకమునకు అరువదినా లుగుమాత్రలును ఉత్తమప్రాణాయామమున నుండును లఘ్వక్షరము

---

[8] సహితః కేవలశ్చేతి కుంభకో ద్వివిధో మతః
హ ప్ర p 79 1 6

[9] హఠయోగప్రదీపిక p 79 1 22

[10] ప్రాణాయామో ఽ యమిత్యుక్త స్స వై కేవలకుంభకః,
కుంభకే కేవలే సిద్ధే రేచపూర్వకవర్జితే ప్ర పు p 8

[11] కనీయసి భవేత్స్వేదః కంపో భవతి మధ్యమే,
ఉత్తమే స్థానమాప్నోతి తతో వాయుం నిబంధయేత్
[illegible] 46 1 511

నుచ్చరించు కాలమునకు 'మాత్ర' యను వ్యవహారము శౌనకమతసిద్ధము

ఈ విభాగమునే లింగపురాణము కొంచెము భేదముతో నిట్లభివర్ణించుచున్నది ప్రాణాయామమానము 12 మాత్రలకాలము ఒక యుద్ఘాతముతో కూడిన 12 మాత్రల మానముగల ప్రాణాయామము నీచమనబడును ఇది సాధకునకు కంపము గలిగించును మూడు యుద్ఘాతములతో గూడి 36 మాత్రలు మానము గల ప్రాణాయామము ముఖ్య మనబడును ఇది ప్రాణమును బ్రహ్మరంధ్రము కడకు జేర్చును గోరక్షుడును పై మాత్రాసిద్ధాంతము నంగీకరించుచున్నాడు [12]

ఉద్ఘాతమనగా దేహమంతటను వ్యాపించిన ప్రాణముచే పీడింపబడిన అపానము పైకి వెళ్లి వెనుకకు మరలుట[13]

దేనివలన ఆనందము-నిద్ర-చిత్తాందోలనము- గగుర్పాటు- పరశబ్దజ్ఞానము- శరీరాక్షేపము- కంపము గలుగుచున్నవో శ్రమజన్యమగు చెమటను- జల్పమును- జ్ఞానమోహమును ఏది జయించునో అది ఉత్తమప్రాణాయామము

ఒక చిటికవేయుటకు పట్టుకాలము మాత్రయనియు, మూడు చిటికలకాలము మాత్ర యనియు, నిద్రపోవువాడు శ్వాసను పీల్చి విడుచుకాలము మాత్రయనియు మాత్రాలక్షణము యాజ్ఞవల్క్యస్మృతి, స్కందపురాణములయందు వర్ణింపబడినది [14]

12 మాత్రల ప్రాణాయామము లఘువనియు, 24 మాత్రల ప్రాణాయామము మధ్యమమనియు, 36 మాత్రల ప్రాణాయామ ముత్తమమనియు మార్కండేయపురాణమున చెప్పబడినది [15]

---

12 ప్రాణాయామస్య మానం తు మాత్రాద్వాదశకం స్మృతమ్',
నీచో ద్వాదశమాత్రస్తు సకృదుద్ఘాత ఈరితః
మధ్యమస్తు ద్విరుద్ఘాతశ్చతుర్వింశతిమాత్రకః,
ముఖ్యస్తు యస్త్రిరుద్ఘాతః షట్త్రింశన్మాత్ర ఉచ్యతే
ప్రస్వేదకంపనోత్థానజనకశ్చ యథాక్రమమ్
హ ప్ర 1 24

13 అందులోనే 1 26

14 అందులోనే 1 27

15 లఘుర్ద్వాదశమాత్రస్తు ద్విగుణః స తు మధ్యమః,
త్రిగుణాభిశ్చ మాత్రాభిరుత్తమోఽయముదాహృతః
మార్కండేయపురాణం

దేహజవాయువు ప్రాణ మనబడును దానిని నిరోధించుట ప్రాణాయామము 12 మాత్రల ప్రాణాయామము మందము 24 మాత్రలు గలది మధ్యమము 36 మాత్రలు గలది యుత్తమము జపముతో గూడిన దానిని సగర్భప్రాణాయామ మనియు, జపరహిత మగుదానిని అగర్భప్రాణాయామ మనియు నందురు రేచకపూరకకుంభకము లని ప్రాణాయామములు మూడు విధములని కూర్మపురాణము [16]

ప్రాణాయామమువలన నేర్పడిన జలముతో శరీరమర్దన మొనర్చుకొనిన దేహము దృఢముగను, తేలికగను నుండును ప్రాణాయామము నభ్యసించువాడు మొదట పాలను నేతిని గ్రహింపవలెను

## ప్రాణాయామసాధనములు

ఎవని దేహమున మేదస్సు-శ్లేష్మము- మిక్కిలిగ నున్నవో వాడు ప్రాణాయామము చేయుటకు ముందు తదంగభూతములగు షట్కర్మల జేయవలెను వాటిని చేసిన తదుపరి ప్రాణాయామ మొనర్చిన త్వరగా సిద్ధించును

అవి 1 ధౌతి 2 వస్తి 3 నేతి 4 త్రాటకము 5 నౌలి 6 కపాలభాతి అను ఆఱు[17] ఇట సంక్షేపముగా వాటి స్వరూపమును పరిశీలింతము

## ధౌతి

నాలుగంగుళములు వెడల్పుగల పదిహేనుచేతులు పొడవుగల తేలికైన వస్త్రమును తీసికొని, దానిని తడిపి కొంచెము వెచ్చగా నుండు

---

16 ప్రాణస్తు దేహజో వాయు రాయామస్తన్నిరోధనమ్,
మాత్రాద్వాదశకో మన్దః చతుర్వింశతిమాత్రకః
మధ్యమః ప్రాణసంరోధః షట్త్రింశన్మాత్రకోత్తమః,
సగర్భమాహు స్సజపమగర్భం విజపం బుధాః
రేచకః పూరకశ్చైవ ప్రాణాయామోఽథ కుంభకః

17 ధౌతిర్వస్తిస్తథానేతి స్త్రాటకం నౌలికం తథా,
కపాలభాతిశ్చైతాని షట్కర్మాణి ప్రచక్షతే
హ ప్ర 1 22

నద్దానిని గురూపదేశానుసారము లోపలికి క్రమముగా మ్రింగవలెను [18] తలపాగలకు పూర్వము అతిసూక్ష్మవస్త్రముల నుపయోగించెడువారు గాన నూతనముగా ధరించు తలపాగల వస్త్రమును తీసికొనుమని శాస్త్రకారుడు చెప్పను మొదటిరోజున ఒక చేతి పొడుగుగల గుడ్డను మాత్రము లోపలకు మ్రింగుట కభ్యాసము చేసి, మరుసటి రోజున రెండు చేతుల వస్త్రమును మ్రింగి, అట్లే రోజును ఒక హస్తము పొడవు వస్త్రమును మ్రింగుట కలవాటు చేయవలెను ఇట్లు పదిహేను రోజులు చేసినచో ధౌతి అభ్యస్తమగును

లోపలికి మ్రింగిన వస్త్రమును ప్రతిరోజును ముందు చెప్పబోవు 'నౌలి' కర్మతో బాగు త్రిప్పి మఱల నెమ్మదిగా బయటకు తీయవలెను ధావ్ గతిశుద్ధ్యోః అను ధాతువునకు క్తిన్నంతరూపము ధౌతి యగును శోధించునది యని దీని యర్థము

దీనివలన కాసశ్వాసలు, యకృత్ప్లీహము, కుష్ఠము, ఇరువది విధము లగు కఫరోగములు నశించును [19]

## వస్తి

నదిలో బొడ్డులోతు నీటిలో కూర్చొని చిటికినవేలు పట్టు రంధ్రముగల లేత వెదురుబొంగును ఆఱంగుళముల దానిని తీసికొని నాలుగంగుళము లవఱకు ఆసనరంధ్రములోనికి పంపి రెండంగుళములు బయట నుంచి మడమలపై పిరుదులానునట్లు కాలివ్రేళ్లపై కుక్కుటాసనముతో నిలిచి నీటిని లోని కాకర్షింపవలెను లోపల ప్రవేశించిన జలమును నౌలికర్మచే బాగా కదల్చి మరల విడువవలెను దీనిని వస్తికర్మ యందురు [20] ధౌతియు, వస్తియును భోజనమునకు పూర్వమే చేయవలెను వీటి

---

[18] చతురంగుళవిస్తారం హస్తపంచదశాయతమ్,
గురూపదిష్టమార్గేణ సిక్తం వస్త్రం శనైర్గ్రసేత్
పునః ప్రత్యాహరేచ్చైతదుదితం ధౌతికర్మ తత్ హ ప్ర [1 15]

[19] కాసశ్వాసప్లీహకుష్ఠం కఫరోగాశ్చ వింశతిః,
ధౌతికర్మప్రభావేన ప్రయాంత్యేవ న సంశయః
హ ప్ర 4 1 3

[20] ళి నాభిదఘ్నజలే పాయౌ న్యస్తనాలోత్కటాసనః,
ఆధారాకుంచనం కుర్యాత్ క్షాళనం వస్తికర్మ తత్
హ ప్ర 1 5

నభ్యసించిన వెంటనే భోజనమునకు విలంబము చేయరాదు పూర్వము మూలాధారముద్వారా వాయువు నాకర్షించుట నభ్యసించి వంశనాళము లేకయే జలమును గ్రహించి మరల విడుచుచుండెడివారు అపుడు జలము పూర్తిగా బయల్పడకపోవుటచే వివిధరోగములు కలిగి ధాతుక్షయ మగును అట్లు చేయరాదు

వస నివాసే అను ధాతువునకు క్తిన్నంతరూపము వస్తి యగును వస్తి యనగా మలాశయము దీనినిబట్టి దీనిని శోధించుకర్మకు వస్తిశోధన మని పేరు కల్గినది అది కాలక్రమమున 'వస్తి' యనియే చెప్పబడుచున్నది

ఈ వస్తికర్మవలన గుల్మము, ప్లీహము, జలోదరము, వాతపిత్త-శ్లేష్మములవలన కలిగిన సకలరోగములును నశించును [21]

ఇంకను ఈ వస్తికర్మ రస -రక్త- మాంస- మేదః- అస్థి- మజ్జా-శుక్రములను ఏడు ధాతువులకును, వాక్ -పాద-పాణి- పాయు-ఉపస్థలను కర్మేంద్రియముల కైదింటికిని, శ్రోత్ర- త్వక్-చక్షుః- జిహ్వా-ఘ్రాణములను జ్ఞానేంద్రియముల కైదింటికిని, మనస్సు- బుద్ధి- చిత్తము-అహంకారములను అంతఃకరణముల కైదింటికిని, పరితాపము - విక్షేపము - శోకము- మోహము- గౌరవము- ఆవరణము- దైన్యము మొ రాజస తామస ధర్మముల బోగొట్టి సుఖము, ప్రకాశము, లాఘవము మొ సాత్విక ధర్మముల కలిగించుట యను ప్రసాదమును, కాంతిని, ద్యుతిని, జఠరాగ్నిదీపమును కలిగించి వాత పిత్త కఫ దోషముల ఉపచయాపచయముల నివారించి ధాతుసామ్యరూపమగు నారోగ్యమును స్థిరపరచును[22]

## నేతి

ముళ్లు లేక పది పదిహేను పేటలుగల మెత్తని మూరెడు దారమును తీసికొని ముక్కులోనికి పంపి రెండవరంధ్రమును వేలితో

---

[21] గుల్మప్లీహోదరం చాపి వాతపిత్తకఫోద్భవాః,
వస్తికర్మప్రభావేన క్షీయంతే సకలామయాః
హ ప్ర 1 7

[22] ధాత్వింద్రియాంతఃకరణప్రసాదం
దద్యాచ్చ కాన్తిం వహనప్రదీప్తిమ్,
అశేషదోషాపచయం విహన్యా
దభ్యస్యమానం జలవస్తికర్మ [హ ప్ర 1 16]

బిగించి పూరకమును చేయవలెను మఱల నోటితో రేచనము చేయగా దారపు చివర నోటిలోనికి వచ్చును ఈ రెండు చివఱలను పట్టుకొని మెల్లమెల్లగా కదల్పవలెను ఇట్లే మఱల వేతే నాసికారంధ్రముగుండా సూత్రమును తీసికొని కూడ పూరకరేచనముల సల్పి సూత్రచాలన మొనర్పవలెను దీనిని నేతియందురు [23]

ఇది నీఞ్-ప్రాపణే అను ధాతువునుండి పుట్టినది నయతీతి నేతి ఇది లౌకికముగ కవ్వపుతాడును బోధించును క్రియాసామ్యమును బట్టి యిచట ప్రయోగింపబడినది

ఇది కపాలములోని, నాసానాలములోని మాలిన్యమును శోధించును సూక్ష్మపదార్థగ్రహణసమర్థముగా దివ్యదృష్టిని కలిగించును స్కంధసంధులయందు గలుగు రోగముల బోగొట్టును [24]

## త్రాటకమ్

ఏకాగ్రచిత్తుడై రెప్పపాటు లేకుండ సూక్ష్మమగు పదార్థమును కన్నీరు వచ్చువఱకు చూడవలెను ఇది మత్స్యేంద్రుడు మొ యోగాచార్యులచే చెప్పబడిన త్రాటకము [25]

ఇది నేత్రరోగములను, బద్ధకమును చిరచిరలాడుట మొ వాటిని బోగొట్టును

---

[23] సూత్రం వితస్తి సుస్నిగ్ధం నాసానాలే ప్రవేశయేత్,
ముఖా న్నిర్గమయే చ్చైషా నేతిస్సిద్దై ర్నిగద్యతే
(అందులోనే 1 7)

[24] కపాలశోధినీ చైవ దివ్యదృష్టిప్రదాయినీ,
జత్రూర్ధ్వజాతరోగౌఘం నేతిరాశు నిహంతి చ
హ ప్ర 1 7

[25] నిరీక్షేన్నిశ్చలదృశా సూక్ష్మలక్ష్యం సమాహితః,
అశ్రుసంపాత పర్యంతమాచార్యై స్త్రాటకం స్మృతమ్
అందులోనే 1 22

## నౌలి

భుజముల ముడిచి పొట్ట నక్కళించి వేగము గల సుడిగుండమువలె కుడినుంచి ఎడమకు ఎడమనుంచి కుడికి శీఘ్రముగ పేగులను త్రిప్పవలెను దీనిని నౌలి యందురు దీనికి న్యోలి యనియు నామాంతరము గలదు [27]

దీనివలన జఠరాగ్ని పెరుగును తినిన ఆహారము జీర్ణమగును మలశుద్ధి కలుగును ఎల్లప్పుడును సుఖముగ నుండును అన్ని దోషములు నశించును ధౌత్యాదిహఠయోగక్రియలందు ఈ నౌలి మౌళివంటిది [28]

## కపాలభాతి

కమ్మరివాడు, కొలిమిలో గాలినూదు గాలితిత్తుల నొకదాని వెంట నొకటి నొక్కునట్లు వేగముగా చేయు రేచకపూరకములు కపాలభాతి యని చెప్పబడును ఇది శ్లేష్మదోషమును బోగొట్టును [29]

ప్రాణాయామసాధనములగు నీ యాఱు కర్మలచే స్థౌల్యము, కఫ దోషము, మలదోషము పోయిన తరువాత ప్రాణాయామము సల్పిన అనాయాసముగ నది సిద్ధించును

## ప్రాణాయామము చేయదగిన సమయము

ఈ ప్రాణాయామమును అరుణోదయమైన తరువాత మూడు ఘడియలలో ప్రాతఃకాలముననను, మధ్యాహ్నకాలముననను, సాయంకాల

---

27 అమందావర్తవేగేన తుందం సవ్యాపసవ్యతః,
నతాంసో భ్రామయేదేషా నౌలిః సిద్ధైః ప్రకథ్యతే
హ ప్ర 1 10

28 మందాగ్నిసందిపనపాచనాది,
సంధాపికాఽఽనందకరీ సదైవ,
అశేషదోషామయశోషణీ చ,
హఠక్రియావకాలిరియం చ నౌలీ
అందులోనే 1 21

29 భస్త్రావల్లోహకారస్య రేచపూరౌ ససంభ్రమౌ,
కపాలభాతిర్విఖ్యాతా కఫదోషవిశోషణీ
అందులోనే 1 3

మునను, అర్ధరాత్రమునందును ఒక్కొక్క కాలమున ఎనుబదిసార్లవఱకు చేయవలెను మూడుకాలములందు అనగా త్రిసంధ్యలయందు చేయు సంప్రదాయమును కలదు నాలుగు కాలములందు చేసినచో ప్రతి దినమునను 320 ప్రాణాయామములు చేయవచ్చును [30]

## వైపరీత్యమున నష్టములు

ఈ ప్రాణాయామమును నియమరహితముగ నొనర్చినచో ప్రయోజనము కలుగదు సరికదా చాలా నష్టములు సంభవించును అయుక్తప్రాణాయామము వలన 'హిక్కా' [Hiccough - Hiccup] శ్వాసకాసలు, శిరోవేదన [Headache], చెవిపోటు [Earache], నేత్రరోగములు [Diseases of the eyes], వాయుప్రకోపము వలన నింకను ఎన్నియో బాధలు వచ్చును [31]

అందువలన మెల్లమెల్లగా వాయువును రేచనము జేసి మెల్ల మెల్లగా పూరించి, మెల్లమెల్లగా వాయువును బంధించవలెను ఇట్లు నియమము లతో నభ్యసించిన వాయు వనాయాసముగ వశపడును [32] సింహమును, ఏనుగును పెద్దపులిని ఎట్లు నెమ్మదిగా కాలక్రమమున వశపరచుకొం దుమో అట్లే వాయువును మెల్లమెల్లగా వశపరచుకొనవలెను లేనిచో వాటివలె నిదియు సాధకుని చంపును [33]

## ప్రాణాయామప్రయోజనము

---

30 ప్రాతర్మధ్యన్దినే సాయమర్ధరాత్రే చ కుంభకాన్,
శనైరశీతిపర్యతం చతుర్వారం సమభ్యసేత్
హ ప్ర 1 21

31 హిక్కా శ్వాసశ్చ కాసశ్చ శిరఃకర్ణాక్షివేదనాః,
భవంతి వివిధారోగాః పవనస్య ప్రకోపతః
హ ప్ర 1 1

32 యుక్తం యుక్తం త్యజేద్వాయుం యుక్తంయుక్తం చపూరయేత్,
యుక్తం యుక్తం చ బధ్నీయా దేవం సిద్ధిమవప్నుయాత్
అందులోనే 1 10

33 యధా సింహోగజో వ్యాఘ్రో భవే ద్వశ్యః శనైశ్శనైః,
తవ సేవితోథై వాయురన్యథా హంతి సాధకమ్
అందులోన్ 1 9

మనలోని వాయువు చంచలముగ నుండగా మన మనసు స్థిరముగ నుండదు వాయువు నిశ్చలముగా నున్న మనసు నిశ్చలముగా నుండును కావున ప్రాణాయామము చేయవలెను వాయువు, చిత్తము నిశ్చలముగా నుండగా సాధకుడు స్థాణువువలె స్థిరమైనవా డగును ప్రాణాయామము చేయనిదే ఆయుష్యము-ఆరోగ్యము పెరగవు కావున ప్రాణాయామము నభ్యసింపవలెను [34]

మన దేహములోని నాడీచక్రము నిర్మలముగ నున్ననే వాయువు దానిమధ్య నుండగలదు అపుడే మనకున్న నీ భావము సిద్ధించును అది సిద్ధింపనిది కార్యసిద్ధి కలుగదు కావున ప్రాణాయామము నభ్యసింపవలెను [35]

నాడీచక్రము షట్కర్మలవలన పరిశుద్ధి నందిననే ప్రాణాయామము సాధకునకు సిద్ధించును కావున ప్రాణాయామమువలన దేహము పరిశుద్ధము, కాంతివంతము గూడనగును [36]

ప్రణవముతోనే యతి ప్రాణాయామము చేయవలెను ప్రాణాయామము నిఖిలపాపముల నడంచును ప్రాణనిరోధమువలన పరిశుద్ధ వాయువును, దానివలన నగ్నియు, దానివలన నీరును పుట్టుచున్నవి ఈ మూడింటిచే లోపల పరిశుద్ధి కలుగుచున్నది [37]

కేవల కుంభకరూప ప్రాణాయామమువలన సాధకునకు మూడు లోకములందును దుర్లభమైన దుండదు తాను యథేష్టముగా వాయు

---

34 చలే వాతే చలం చిత్తం నిశ్చలే నిశ్చలం భవేత్,
యోగీ స్థాణుత్వమాప్నోతి తతో వాయుం నిరోధయేత్
హ ప్ర 1 23

35 మలాకులాసు నాడీషు మారుతో నైవమధ్యగః,
కథం, స్యాదున్మనీభావః కార్యసిద్ధిః కథంభవేత్
అందులోనే 1 14

36 శుద్ధిమేతి యదా సర్వం నాడీచక్రం మలాకులమ్,
తదైవ జాయతే యోగీ ప్రాణసంగ్రహణేక్షమః
హ ప్ర 1 27

37 ప్రణవేనైవ కుర్యాచ్చ ప్రాణాయామాన్ యతిరుమహుః,
సర్వేషామపి పాపానాం సంఘాతే సముపస్థితే,
నిరోధాజ్జాయతే వాయుః వాయోరగ్నిర్హి జాయతే,
తాభ్యామాపోఽభిజాయన్తే తతోఽన్తః శుధ్యతే త్రిభిః
వసిష్ఠస్మృతి

వును ధరించుటకు కాతడు శక్తుడగును [38]

రాజయోగపదమునందును, కుంభకప్రాణాయామము చేయువానికి ఆధారశక్తి యగు కుండలినీశక్తి ప్రబుద్ధమగును దానివలన సుషుమ్నానాడికి కఫాదుల అడ్డగింపుండదు ప్రత్యాహారపరంపర సిద్ధించి పరంపరగా కైవల్యము సిద్ధించును [39]

హఠయోగము సిద్ధింపనిదే రాజయోగము సిద్ధింపదు రాజయోగము సిద్ధింపనిదే హఠయోగమును సిద్ధింపదు కనుక రెంటిని సమానమగు నిష్పత్తిలో నభ్యసింపవలెను కుంభకప్రాణాయామమొనర్చిన తరువాత మనస్సును నిరాశ్రయముగ నుంచవలెను ఇట్లభ్యసించిన రాజయోగస్థానము నందును

బ్రహ్మాదిదేవతలును యమునిభయమువలన రేచకపూరకకుంభక ప్రాణాయామముల నభ్యసించి ముప్పదివత్సరముల (త్రిదశులు)వారైరి కనుక ప్రాణాయామము నభ్యసింపవలెను మనదేహమునం దెంత కాలము ప్రాణనిరోధము చేయబడునో, మన స్సెంతకాలము ప్రసన్నముగ నుండునో, దృష్టి కనుబొమ్మల మధ్య నెంతకాల ముండునో అంతవఱకు యముని వలన భయములేదు

కొలిమిలో వేసి గాలితిత్తితో ఊదబడుచున్న బంగారు మొ ధాతువులందలి దోషము లెట్లు దహింపబడునో అట్లే ప్రాణాయామమువలన ఇంద్రియదోషములు దహింపబడుచున్నవి ప్రాణాయామములతో దోషములను, ధారణలతో పాపమును, ప్రత్యాహారములతో సంబంధములను,

---

[38] న తస్య దుర్లభం కించిత్త్రిషు లోకేషు విద్యతే ,
శక్తః కేవలకుంభేన యథేష్టం వాయుధారణాత్
హ ప్ర 1 12

[39] రాజయోగపదం చాపి లభతే నాత్ర సంశయః,
కుంభకాత్కుండలీబోధః కుండలీబోధతో భవేత్
అనర్గలా సుషుమ్నా చ హఠసిద్ధిశ్చ జాయతే,
హఠం వినా రాజయోగం రాజయోగం వినా హఠః
అందులోనే 1 21

ధ్యానముతో ప్రాకృతగుణములను దహింపవలెను [40]

నియమితమార్గములలో ప్రాణాయామముల నభ్యసించుటచే నాడీ చక్రము నిర్మలము కాగా ఇడాపింగళలకు మధ్యనుండు సుషుమ్నా ముఖమును భేదించి సుఖముగా దానిలోనికి వాయువు ప్రవేశించును వాయువు సుషుమ్నలో సంచరించుచుండగా మనస్సు స్థిరమగును మాన సికస్థైర్యమే మనోన్మని యను యవస్థ ఈ మనోన్మనీఅవస్థ కొఱకే సాధకు లెంతగానో ప్రయత్నింతురు కుంభకములు దీనికొఱకే చెప్పబడినవి

ప్రాణాయామ మెపుడు స్థిరముగా నభ్యస్తమగునో అపుడు ప్రాణము బ్రహ్మరంధ్రమును చేరును బ్రహ్మరంధ్రమును చేరిన వాయువచట 150 ఉచ్ఛ్వాసనిశ్వాసల పర్యంత మున్నచో అది ప్రత్యాహార మగును ప్రత్యాహార మనగా 'స్వవిషయాసంప్రయోగే చిత్తస్య స్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః' [యోగ 54-2] 5 ఘడియలసేపున్నచో అది ధారణ యగును ధారణ యనగా 'దేశబంధశ్చిత్తస్య ధారణా' [యోగ-1-3] 60 ఘడియల సేపున్నచో అది ధ్యానమగును ధ్యాన మనగ తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్ [యోగ-2-3] 12 రోజు లుండగలిగినచో అది సమాధి యనబడును సమాధి యనగా తదే వార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః [యోగ-3-3]

దేహము సన్నబడుట, ముఖము ప్రసన్నముగా నుండుట, ధ్వని స్ఫుటముగా నుండుట, కన్నులు నిర్మలముగా నుండుట, మంచి ఆరో గ్యము, ధాతుజయము, అగ్నిదీప్తి, నాడులు శుద్ధముగా నుండుట, ఇవి హఠయోగసిద్ధికి పూర్వలక్షణములు [41] ఎపుడు లోపలి నాడులు

---

[40] దహ్యన్తే ధ్యాయమానానాం ధాతూనాం హి యథా మలాః,
తథేంద్రియాణాం దహ్యన్తే దోషాః ప్రాణస్య నిగ్రహాత్
ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషమ్,
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనానీశ్వరాన్ గుణాన్
మనుస్మృతి

[41] వపుః కృశత్వం వదనే ప్రసన్నతా
నాదస్ఫుటత్వం నయనే సునిర్మలే,
అరోగతా బిందు జయోఽగ్నిదీపనం
నాడీవిశుద్ధిః హఠయోగలక్షణమ్
హ ప్ర 1 8

పరిశుద్ధము లగునో అపుడు బాహ్యమున కూడ శరీరము సన్నగిల్లుట, కాంతి, వాయువు నిచ్చవచ్చినట్లు ధరించుట, అగ్నిదీపనము, గంభీరధ్వని ఇవి నాడీశోధనము వలన సంభవించును [42]

## పాంచరాత్రంలో ప్రాణాయామం

ఈ ప్రకారము స్మృతీతిహాసాలలో నిరూపింపబడిన ప్రాణాయామం పాంచరాత్రంలో ఎలా ప్రతిపాదింపబడినదని మనం చూస్తే మనకు చాలా ఆశ్చర్యం కలుగుతుంది

యోగపాదంలో యోగాంగములను గూర్చి వివరిస్తూ యోగాంగాలైన అహింస- సత్యం- అస్తేయం -బ్రహ్మచర్యం- దయ -ఆర్జవం- క్షమ-ధృతి - మితాహారము-శౌచము అను పదియమములతోను, తపస్సు- తుష్టి- ఆస్తిక్యము- దానము- ఆరాధనము- సిద్ధాంతశ్రవణము -సిగ్గు- జపము- మొ నియమములతోను, స్వస్తికాద్యాసనములతోను కూడినవాడై సాధకుడు నాడీశుద్ధికొఱకు ప్రాణాయామం చేయాలని నిరూపింపబడింది

తన అంగుళి ప్రమాణంగా ప్రతివాని దేహమును 96 అంగుళములు పొడవు కలిగియుంటుంది ప్రాణము దేహమున కంటె 12 అంగుళముల హెచ్చుపొడవు (అనగా 108 అం ) కలిగియుంటుంది దేహములో నున్న వాయువును దేహంలో పుట్టిన వహ్నికి తక్కువగా గాని సమానంగాని చేస్తే బ్రహ్మస్వరూపం గోచరిస్తుంది [43] నాడులన్నీ పరిశుద్ధిని పొందాలంటే ప్రాణాయామం చేయాలి ప్రాణాయామం పవిత్రమైన జనసమ్మర్దంలేని ప్రదేశంలో అభ్యసించాలి దారుమయ

---

[42] యదా తు నాడీశుద్ధిః స్యాత్తథా చిహ్నాని బాహ్యతః ,
కాయస్య కృశతా కాంతిస్తదా జాయేత నిశ్చితమ్
యథేష్టధారణం వాయోరనలస్య ప్రదీపనమ్,
నాదాభివ్యక్తిరారోగ్యం జాయతే నాడీశోధనాత్
అందులోనే 1 24

[43] దేహమానం స్వాంగులీభిః షణ్ణవత్యంగులాయతమ్,
ప్రాణశ్శరీరాదధికః ద్వాదశాంగులమానతః
దేహస్థమనిలం దేహసముద్భూతేన వహ్నినా,
న్యూనం సమం వా యోగేన కుర్వన్ బ్రహ్మ విదిష్యతే
పాద్మసంహిత 1 25

మైన ఆసనంపై దర్భలను గాని జింకచర్మాన్ని గాని వేసి దానిపై యోగాంగములుగా చెప్పబడిన స్వస్తికాద్యాసనములలో దేనితోనైనను తూర్పున కెదురుగా వీలుగా కూర్చొని, కనుబొమ్మలలో దృష్టిని నిల్పి, పండ్లను బిగించక నాలుకను తాలువునం దుంచి భుజములను వదులుగా నుంచి, తలను కొంచెము ముడుచుకొని యోగముద్రతో ప్రాణాయామము చేయవలెను [44] వాయురేచనము, వాయుపూరణము, వాయురోధనము, మఱల రేచనము, ఈ నాల్గింటిచే వాయుక్లేశనమే ప్రాణాయామ మని చెప్పబడినది కుడిచేతితో ఒక నాసికారంధ్రమును బిగించి 'ఇడ' యను నాడితో పూరణము చేయవలెను తనలో పూరించిన వాయువును కుంభింపవలెను మెల్లమెల్లగా కుంభించిన వాయువును, తదుపరి 'పింగళ' యను నాడితో బయటకు రేచనము చేయవలెను

ఈ పూరణ రేచన రోధనములు రెండు రకములు 1) 8 మాత్రల కాలము ప్రమాణముగలవి 2) 16 మాత్రల కాలము ప్రమాణముగ కలవి పూరణసమయమున కుండలో నీరు నింపినట్లు దేహములోని నాడు లన్నిటిలోను వాయువును నింపవలెను

### ప్రాణాయామవిభాగం

ఏ ప్రాణాయామమున సాధకునకు చెమట పట్టునో అది అధమ ప్రాణాయామము దేనియందు దేహమున కంపము జనించునో అది మధ్యమ ప్రాణయామము దేనియందు దేహములోని బ్రహ్మరంధ్రము వద్ద ప్రాణము చేరునో అది ఉత్తమప్రాణాయామము

అధమప్రాణాయామము వలన సకలవ్యాధులు పాపములు నశించును మధ్యమమువలన పాప -రోగ-మహావ్యాధుల నాశము కలుగును ఉత్తమ ప్రాణాయామమువలన అల్పమూత్రమలుడు, తేలికైన దేహము గలవాడు, మితాహారి, వశేంద్రియుడు, బుద్ధిశాలి, త్రికాలజ్ఞానసంపన్నుడు నగును

### ప్రాణాయామప్రయోజనం

ఈ ప్రాణాయామము వలన 1 ప్రాణము 2 అపానము 3 సమానము 4 ఉదానము 5 వ్యానము 6 నాగము 7 కూర్మము

[44] See Paadmasamhita I 11

8 కృకరము 9 దేవదత్తము 10 ధనంజయము అను పది ప్రాణములు, 1 సుషుమ్న 2 ఇడ 3 పింగళ 4 గాంధారి 5 హస్తిజిహ్వ 6 పూష 7 యశస్విని 8 కుహూ 9 యాతా 10 కేశిని అను పది నాడులయందును ధారాళముగా సంచరింపగలవు

కంఠకూపమునం దధోముఖముగ ఎనిమిదిదళములతో తాటి చెట్టు వంటి కాడతో, అరటిపువ్వు వలె, చంద్రకాంతశిలవలె ప్రకాశించు హృదయపద్మము బాగా విస్తరించును

త్రిసంధ్యలయందు అర్ధరాత్రమునందు తడవకు 16 ప్రాణాయామముల వంతున ఒకరోజు చేసినచో అన్ని పాపములనుండి పవిత్రుడగును

ఎవరు 3సం ప్రాణాయామము సల్పుదురో వారు పాపరహితులై హృదయాంభోరుహమునందున్న నన్ను చూడ గలుగుదురు యోగసిద్ధిని యోగి పొందగలడు వాయువును జయించినవాడు ఇంద్రియజయము నంది, మితాహారి, స్వల్పనిద్రుడు, తేజస్వి, బలవంతుడునై అపమృత్యువు నందక దీర్ఘాయుష్యము నందును [46] ఎవడు రేచక పూరకములను వదలి కుంభీకరణమునే ఎల్లప్పుడును చేయునో వానికి ముల్లోకములందు దుర్లభముండదు [47]

బొడ్డువద్దను, నాసాగ్రమునందును, పాదాంగుష్ఠమునందును, మానసికైకాగ్రతతో త్రిసంధ్యలయందు ప్రాణమును ధరించుటవలన సర్వరోగ

---

[46] కిమన్యైర్బహుభిః ప్రోక్తైః ప్రాణాయామపరాయణాః,
నిర్ధూతసర్వపాప్మానో వత్సరత్రయపూరణే
పశ్యన్తి మామపి బ్రహ్మన్ హృదయాంభోరుహే స్థితమ్,
సంవత్సరత్రయాదూర్ధ్వం ప్రాణాయామపరో నరః
యోగసిద్ధో భవేద్యోగీ వాయుజిద్విజితేంద్రియః,
అల్పాశీః స్వల్పనిద్రశ్చ తేజస్వీ బలవాన్ భవేత్
అపమృత్యుమతిక్రమ్య దీర్ఘమాయు రవాప్నుయాత్
పాద్మసంహిత P 80

[47] అందులోనే_ P_81

వినిర్ముక్తుడును, యోగియు, శ్రమరహితుడును అగును [48]

బొడ్డువద్ద ప్రాణములు ధరించిన ఉదరరోగము లన్నియు నశించును నాసాగ్రమున ప్రాణముల ధరించిన దీర్ఘాయుష్యము కలుగును పాదాంగుష్ఠమునందు ధరించినచో దేహము తేలికగును జిహ్వాగ్రమున ప్రాణముల ధరించిన శ్రమరహితుడును, దాహరహితుడు నగును

బ్రాహ్మముహూర్తమున జిహ్వతో వాయువు నాకర్షించువాడు మూడు మాసములలో వాక్సిద్ధి నందును ఆఱు మాసములలో మహారోగములు నశించును ఏ యే అవయవములు రోగములతో నున్నవో వాటి యందు ప్రాణవాయువును ధరించిన వాటి కారోగ్యము కుదురును మానసికనైర్మల్యము, నిశ్చలత యున్ననే వాయువును నిరోధింప వీలగును

ఇట్లు పాంచరాత్రశాస్త్రమున ప్రసిద్ధమైన సంహితలలో నీ ప్రాణాయామమునుగూర్చి సవిశేషముగ నభివర్ణింపబడినది మచ్చున కొక సంహితలోని విషయములు మాత్ర మిచట ఉదహరింపబడినవి ఇట్లే మూలవేదమని వేదవ్యాసునిచే పంచమవేదమగు భారతమునందు వక్కాణింపడిన పాంచరాత్రశాస్త్రమున సకలశాస్త్రములకు మూలసూత్రములు వేదములం దభివర్ణింపబడినట్లే యభివర్ణింపబడియున్నవి

ఇటువంటి మహత్తరప్రయత్నములచే ప్రాచీనులగు మహర్షులు అతీంద్రియములగు శక్తులను వశపరచుకొని మనకిపు డాశ్చర్యకారణములగు కార్యముల నాచరించియున్నారు వాటిని పరిశీలించి ప్రాయోగికముగా సత్యాన్వేషణము చేయుట మన బాధ్యతయై యున్నది

---

[48] నాభికందే చ నాసాగ్రే పాదాంగుష్ఠే చ యత్నవాన్,
ధారయన్మనసా ప్రాణాన్ సంధ్యాకాలేషు సర్వదా,
సర్వరోగ వినిర్ముక్తో భవేద్యోగీ గతక్లమః
అందులోనే P 81

# 12. కణాదుని వైశేషికం : ఆధునికుల అణువిజ్ఞానం

భారతీయుల మహోన్నత వైజ్ఞానిక పరిశోధనా ఫలితములే దర్శనము లను పేర ప్రసిద్ధి గాంచినవి ఆస్తికదర్శనములు, నాస్తికదర్శనములని ఇవి రెండు విధములు అందు ఆస్తికదర్శనములు ఆఱు ఈ ఆఱింటిలో అభౌతికముల కంటె భౌతికపదార్థముల స్వరూపస్వభా వముల నిశితదృష్టితో చర్చించినది వైశేషికదర్శనము దర్శనమనగా తత్త్వజ్ఞానమును నిరూపించు శాస్త్రము 'దృశ్యతే అనేన ఇతి దర్శనమ్' అని దర్శనశబ్దవ్యుత్పత్తి

"దర్శనం తత్త్వజ్ఞానసాధనం శాస్త్రమ్" అని న్యాయకోశకారుని నిర్వచనము వైశేషికదర్శనమును రచించినది కణాదుడను మహర్షి ఈతనికే 1 కణభక్షుడు, 2 కాశ్యపుడు, 3 ఔలుక్యుడు అను పేర్లను కలవు తపస్సు నాచరించు సమయమున ఉంఛవృత్తిలో కపోతమువలె మార్గమునందు పడిన ధాన్యకణములను మాత్రమే మెసవి,

ఈశ్వరానుగ్రహముచే ఈ తత్త్వజ్ఞానమును సంపాదించుటచే నితనికి కణాదుడు, కణభక్షుడనియు, కశ్యపగోత్రమునందు పుట్టినవా డగుటచే కాశ్యపుడనియు, ఉలూకుడను మహర్షి పుత్రుడగుటచే ఔలూక్యుడనియు ఇతనికి ప్రసిద్ధి యేర్పడినది ఈయన కాలమునుగురించి అనేక వాదము లున్నవి అతడు వేలసంవత్సరాలకు పూర్వమువా డనేవరకు ఎవరూ కాదనజాలరు యోగాభ్యాసమహిమచే ఉగ్రతపశ్శక్తిచే ప్రపంచమూలప దార్థముల నన్నింటిని యథార్థముగ తెలిసికొనిన మహర్షిమూర్ధన్యుడు కణాదుడు

## వైశేషికదర్శనము

లోకములోని పదార్థములన్నియు 1 ద్రవ్యము 2 గుణము 3 కర్మ 4 సామాన్యము, 5 విశేషము 6 సమవాయము 7 అభావము అని ఏడు రకములుగ నున్నవని మొట్టమొదట ప్రతిపాదించినది వైశేషికదర్శనము వైశేషికదర్శన మను పేరెట్లు కలిగినదను విషయమున చాలా అభిప్రాయములు కనబడుచున్నవి

ద్విత్వే చ పాకజోత్పత్తౌ విభాగే చ విభాగజే,
యస్య న స్ఖలితా బుద్ధిః తం వై వైశేషికం విదుః

అని ద్విత్వ-పాకజరూపాద్యుత్పత్తి- విభాగజ- విభాగము లను విషయములను సక్రమముగ నిరూపించుటచే వీరికి వైశేషికులను ప్రసిద్ధి కలిగినదని సర్వదర్శనసంగ్రహమున సాయణమాధవు లుదాహరించినారు

2 ధర్మవ్యాఖ్యానమును చేయ సంకల్పించి మొదటి చివటి సూత్రములందు 'ధర్మవిశేషప్రసూతాత్' [1 1 1] "సంయుక్తసమవాయాదగ్నే ర్వైశేషికమ్" [10 2 7] విశేషపదమును మహర్షి నిర్దేశించుటచే దీనికి వైశేషికమను పేరు కల్గినదని ఒక కల్పన

3 లోకములోని ప్రతిపదార్థములోని విశేషమును సమానధర్మవిరుద్ధ నిరూపణముచే సామాన్యులకు కూడ సులభముగ తెలియునట్లు ప్రతిపాదించుటచే దీనికి వైశేషికమను వ్యవహార మేర్పడినదని ఒక నిరూపణసరణి

4 ఇతరదర్శనములకంటె పదార్థతత్త్వమును బాగా గుర్తెరిగి ద్రవ్యాదులు విభజింపబడినవను విశేషమును తెలియజేయుచు దీనికి వైశేషికదర్శనమను నామ మేర్పడినదని ఒకానొక పరిశీలనము

5 ఈ దర్శనములోని పదార్థశోధనపద్ధతిని వైదికుడైన గౌతముడు

న్యాయదర్శనమునంధును సంధించుటచేతను కణాదప్రోక్తమగు పర మాణుకారణవాదమును లౌకికులగు బౌద్ధులు-జైనులు స్వీకరించుట చేతను, ఇది సకలజనాదరణీయములగు సర్వపదార్థముల సమగ్రముగ నిరూపించుటయును విశేషమువలన ఇతరదర్శనములకంటె ఉత్కృష్ట మీ దర్శనమని దీనికీ పేరు వచ్చినట్లు కొందఱి అభ్యూహ

6 ఈ జగత్తునకు ప్రకృతి - పురుషులు ఉపాదానకారణము లను వాదమును వదలి పరమాణువులు ఉపాదనకారణము లను వాద మును స్థాపించుట యను విశేషముచే దీనికి వైశేషికమను సమాఖ్య కలిగినదని ఒక భావన

7 నిత్యద్రవ్యములం దుండు 'విశేషము' అను పదార్థమును కనుగొ నుటచే దీనికి వైశేషికమను అన్వర్థనామము కలిగినదని బహుజన బహుమానము నందిన సిద్ధాంతము

ఇట్లు కణాదమహర్షిచే రూపొందింపబడిన వైశేషికదర్శనమునందు పది అధ్యాయములు కలవు ఒక్కొక్క అధ్యాయమునందు రెండాహ్ని కములు కలవు మొత్తం 370 సూత్రములు కలవు దీనికి ప్రశస్త పాదుడను మహర్షి 'పదార్థధర్మసంగ్రహము' అను పేర భాష్యమును వ్రాసెను దానిపైన ఎన్నో వ్యాఖ్యానములు స్వతంత్రగ్రంధములును ఏర్పడినవి

పదార్థముల సాధర్మ్యవైధర్మ్యజ్ఞానముచే కలుగు తత్త్వజ్ఞానము వలన మోక్షము కలుగునని నిరూపించబడినది

**అణుసాధనము**

ఈ వైశేషికదర్శనమున 45వ అధ్యాయ ప్రథమాహ్నికమున 14 సూత్రములలో అణుస్వరూపము, స్వభావములను గూర్చిన చర్చను కణాదు డొనర్చినాడు

పరమాణువు నిత్యము ద్వ్యణుకములు అనిత్యములు

'తస్య కార్యం లింగమ్' (4 1 1) అను సూత్రముద్వారా పరమాణువును సాధించినాడు

శబ్దమనున దొక కార్యము లోకమున కారణము లేనిదే కార్యము సిద్ధింపదు అయినచో శబ్దమునకు కారణ మేదై యుండును? ఆకాశము శబ్దమునకు కారణము అనగా శబ్దముద్వారా మనము ఆకాశమును సాధించితిమి అట్లే మన కంటికి గోచరించు వస్త్రము - గృహము

-గోపురము మొ పదార్థములును తమలో గల రూపాదులకు సజా తీయములైన రూపాదులుగల తమకంటె చిన్నవైన అవయవములతో నేర్పడినవి

సూర్యకిరణములు మన ఇంటిలోనికి కిటికిలోనుండి పడినపుడు ఆ కిరణముల కాంతిలో అతి సన్నని కణములు కొన్ని ఎగురుచున్నట్లు మనకు కనపడును అందులో అతి సన్నని కణములను త్రసరేణువు లందురు ఆ త్రసరేణువుకూడా దానికి యోగ్యమైన అవయవములతో ఏర్పడినదే ఆ త్రసరేణువులో నాల్గువైపుల నాల్గు అవయవములకును అడుగున, పైన రెండు అవయవములకును మొత్తం ఆరు రేణువులకు సంయోగము కనబడుటచే, ఆ ఆరు అవయవములతో అది ఏర్పడినదిగా తెలిసికొననగును అందులో గల రెండు అణువులు కలసి ద్వ్యణుకము కాగా మూడు ద్వ్యణుకములు కలసి త్రసరేణువును పుట్టించినవి

'పరిమాణములోని తరతమభావమునకు ఒక హద్దు నంగీకరింపవ లెను అది తరతమభావము గనుక'అను అనుమానప్రమాణము వలన త్రసరేణువులోని అవయవము ద్వ్యణుకము, ద్వ్యణుకములోని అవయ వము పరమాణువుగా సిద్ధించినది ఇది త్రసరేణువులో ఆఅవభాగముగా చెప్పబడుచున్నది ద్వ్యణుకమును గూడ అణువనియే వ్యవహరింతురు కనుక మూడు ద్వ్యణుకములతో ఏర్పడిన త్రసరేణువు త్ర్యణుకమనియు పిలువబడుచున్నది

ఈ పరమాణువులో అవయవములు లేవు అట్లు వానిలో గూడ అవయవముల నంగీకరించినచో ఈ అవయవప్రవాహమునకు హద్దుండదు కనుక ఏదో ఒక హద్దుండవలెను గాన చిట్టచివర హద్దుగానే పరమాణువు నంగీకరించిరి అందువలననే 'పరమ' అను పద ముపయోగింపబడినది పరమ మనగా చాలా మిక్కిలి యని యర్థము అవయవములుగల త్ర్యణుకము, ద్వ్యణుకము అను అణువు లుండగా ఇది అవయవములు లేని అణువు అని చెప్పుటకే దీనిని పరమాణు వనిరి కనుకనే 'పరః మా యస్మాత్ సః పరమః' అను వ్యుత్పత్తి కుదురుచున్నది ఇంతకంటే తక్కువది ఇంకొకటి లేదు గాన దీనికి 'పరమ' అను విశేషణము సరిపోవుచున్నది 'పరమ' అను పదము ముందున్న పదము 'మిక్కిలి' అను అర్థము నిచ్చు శక్తి నిచ్చుచున్నది అణువనగా స్వల్పమైనది 'దీనికంటె తక్కువైనది లేనిది'అని అర్థము సిద్ధించినది అట్లే 'పరమపురుషుడు' అన్నప్పుడు భగవంతుని మహత్త్వమును 'పరమ'

అను పదము చెప్పుచున్నది

ఇది నిరవయవము (అవయవములు లేనిది) కనుక నిత్యము కూడ నైనది దీనిలో ఉద్భూతరూపము లేదు కావున ఇది ప్రత్యక్షము కాదు పరమాణుగతమైన వివిధగుణములు మనకు కనపడకపోవుటకు మనకు గ్రహించు సామగ్రి లేకపోవుటవలననే గాని అందు రూపాదిగుణ ములు లేకపోవుటవలన కాదు అనగా మానవుని చక్షురింద్రియమునకు కల శక్తి ఈ విషయమున స్వల్పమైనది యంత్రపరికరసాహాయ్యము న్నచో అవియును మనకు గోచరించుటలో ఆశ్చర్యము లేదు

## అణువిభాగము:

పరమాణువులు రెండు కలిసిన ద్వ్యణుక మేర్పడును పరమాణు వులు నిత్యములు గాని ద్వ్యణుకములు అనిత్యములే ద్వ్యణుకములు మూడు ఒకచో చేరిన త్ర్యణుక మేర్పడును త్ర్యణుకము అనిత్యమైన మహత్పదార్థములందు కట్టకడపటిది త్ర్యణుకమునే త్రసరేణు వందురు ఈ త్ర్యణుకము అణుపదార్థము గాక మహత్పదార్థమగుటచేతనే దీనికి త్రసరేణువను వ్యవహార మేర్పడినది అట్లే నాలుగు ద్వ్యణుకములు గలసిన చతురణుకము ఏర్పడును

అణువులు వాటి పరిమాణముచే నిత్యములని, అనిత్యములని రెండు విధములు నిత్యములు పరమాణువులు అనిత్యములు ద్వ్యణుకములు పరమాణువులందు కల పరిమాణమును పారిమాండల్య మందురు దేనికంటే తక్కువ పరిమాణ ముండదో దానిని తార్కికులు పారి మాండల్యమని పరిభాషింతురు ఈ పరమాణువులే మనకు కనపడు వివిధస్థూలపదార్థములకు కారణములని వైశేషికసిద్ధాంతము

## విశేషపదార్థము:

కణాదుడు ఈ పదార్థమును కనుగొనుటచేతనే తన దర్శనము నకు వైశేషికమను నామకరణము చేసినాడని మొదట అనుకొంటిమి విశేషముల విశేషము నిట తెలిసికొందము

'అన్యత్రాన్త్యేభ్యో విశేషేభ్యః' [1 2 6] అను సూత్రముద్వారా విశేషపదార్థమును ఇట్లు నిరూపించినాడు

ఇది ఉత్పత్తివినాశములు లేని నిత్యద్రవ్యములం దుండును అనగా పృథివీ- జల- తేజో- వాయు పరమాణువులయందును, ఆకాశము- కాలము- దిక్కు- ఆత్మ- మనస్సు అనువానియందును ఇది యుండును

కొన్ని పదార్థములయం దల్పసంఖ్యలోను ఇది కలదు దీని ప్రధానలక్ష ణము ఒక పదార్థమునుండి ఇంకొక పదార్థమును వేఱుగా నిరూపించుట కనుకనే-

'నిత్యద్రవ్యవృత్తయః వ్యావర్తకా విశేషాః' అనియు దీనిని పేర్కొం దురు 'ఈ విశేషము ఇందుండుటవలన, ఈ పృథివీపరమాణువు ఇతర జల-తేజో- వాయు- పరమాణువుల కంటే వేరైనది' అను మాదిరి పరస్పరభేదజనక మీ విశేషపదార్థము పరమాణువులే మన కంటికి కనపడునవి కాదు కావున తద్గతములగు ఈ విశేషములును మనకు గోచరింపవు కాని గోవును చూచినపుడు మనకు 'ఇది మహిషము కాదు, గోవు' అను మహిషభేదజ్ఞానము గోవులలో కలిగినట్లు, మన కంటే అన్ని విషయములలోను ఉత్కృష్టశక్తిసంపన్నులగు యోగులకు నిత్యములై సమానాకారము, సమానగుణములు, సమానక్రియలు గల పరమాణువులయందు ముక్తులైన వారి ఆత్మలలో, మనస్సులలో గల తారతమ్యము స్పష్టముగ గోచరించును ఆ జ్ఞానము పరస్పర భేదకమైన పదార్థము అందు లేనిచో కలుగుటకు వీలు లేదు కావున విశేష మను పదార్థమే ఈ విభిన్నజ్ఞానమునకు మూలము ఈ విశేషములే 'ఆ పరమాణువే ఇది' 'ఆ మనస్సే ఇది' అను మాదిరి ప్రత్యభిజ్ఞను వారికి కలిగించుటలో హేతువులు

## అణువుకు, ఆత్మకు, అదృష్టమునకు సంబంధాన్ని వివరి-స్తోంది వైశేషికం

ఈ విశేషములు పరమాణువులందు మాత్రమే కాక ఆకాశాత్మాదు లలో గూడ కలవు బద్ధులైన ఆత్మలలో సుఖదుఃఖాదులచే భేదమును ఈ విశేషములే తెలియజేయుచున్నవి అట్లే సృష్టికాలములో శబ్దాదులచే ఆకాశమునకు ఇతరవిభువులతో భేదము స్పష్టముగా తెలియుచున్నను ప్రళయసమయమున ముక్తాత్మల కంటే ఆకాశమునకు ఈ విశేషములే భేదమును కలిగించుచున్నవి కణాదాదియోగులకు వారి యోగాభ్యాసశ క్తిచే ఈ విశేషములు అతిస్పష్టముగ గోచరించును

## పరమాణుకారణవాదం:

ఆరంభవాదః కణభక్షపక్షః సంఘాతవాదస్తు భదన్తపక్షః
సాంఖ్యాదిపక్షః పరిణామవాదో వేదాన్తపక్షస్తు వివర్తవాదః "

ఈ సృష్టి మూలకారణములనుండి ప్రారంభింపబడినదని వైశేషికులును, ఉపాదానకారణసంఘాతరూపమేనని బౌద్ధులును, ఉపాదాన కారణ పరిణామరూపమని సాంఖ్య - పాతంజల - విశిష్టాద్వైతులును, ఉపాదానకారణ- వివర్తరూపము (అసత్యమైన మార్పు) అని అద్వైతులును అభిప్రాయపడిరి అందు పరమాణుకారణవాద మాధునికపరిశోధనలకు దగ్గఱలో నున్నది దీనినే ఆరంభవాదమనియు అందురు

కిటికీలో నుండి పడిన సూర్యకిరణములందు కనపడు రేణువులలో అతిసూక్ష్మమైనవే లోకములో అన్త్యావయవములుగ నున్నవి కాన అవియే ఈ దృశ్యపదార్థములకు మూలకారణములగు పరమాణువులని చార్వాకులనుకొనిరి పృధివీ - జల - తేజో వాయు పరమాణువులను వీరంగీకరించిరి

2 కంటి కగపడు పై రేణువులలో అవయవములే పరమాణువులని అనుమానప్రమాణముచే బౌద్ధులు భావించిరి

3 ఒకే రకమైన పరమాణువులు సృష్టికి మూలకారణములని జైనులభిప్రాయపడిరి

4 పరమాణువు లనిత్యములు శబ్దమునుండి ఆకాశము, దాని నుండి వాయువు, వాయువు నుండి తేజస్సు, తేజస్సు వలన జలము, జలము వలన పృధివి పుట్టినవని మీమాంసకులు, వైయాకరణులు ఊహించిరి

5 వైశేషికులు ఆరంభవాదమును స్థాపించిరి వారి మతమున పరమాణువులే సృష్టికి మూలకారణము ఇతరులు చెప్పిన సూర్యకిరణములందు కనపడు రేణువులను వీరు పరమాణువు లనలేదు వాటి అవయవములు కూడా పరమాణువులు కాదు వాటిలో కూడా అవయవములు కలవు ఆ అవయవములే పరమాణువులు అవియే నాల్గుభూతములకు మూలకారణములు రెండు పరమాణువులు కలసినచో అది ద్వ్యణుకము ఈ ద్వ్యణుకమే పై రేణువులను పుట్టించును మూడు ద్వ్యణుకములకు సంయోగము కలిగిన త్ర్యణుక మేర్పడును ఆ త్ర్యణుకమే సూర్యకిరణములం దగపడు రేణువు ఈ పరమాణువులు నిత్యములు ఉత్పత్తినాశరహితములు

శరీరమునకు అలసట కలిగినపుడు మనము నిద్ర పోవుదము నిద్రావస్థలో కూడ ఆయుష్యక్రమమును పరిరక్షించుటకు ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమగు శ్వాసపరంపర అనువర్తించుచునే యుండును. దానివలననే మనకు ఆ యా సమయములలో మెలకువ వచ్చును అట్లే ప్రళయరా

త్రిలో ఏ రకమైన క్రియలు లేక స్తిమితాకాశమువలె నుండు జగత్తునందు 'నిద్రావస్థ' లో నున్న పరమేశ్వరునకును శ్వాసక్రమముండును అదియే అవాంతరప్రళయసమయమున పరమాణువులలో నుండు చలనాత్మకకర్మ యని చెప్పబడును ఆ కర్మలు ప్రళయకాలమందు అతివేగముగ సంచరించు ఆ పరమాణువులలో సంయోగమును కలిగింపజాలవు కనుకనే ప్రళయావస్థలో ద్వ్యణుకాదులు పుట్టుటకు వీలులేదు ప్రళయావస్థలో మహాభూతసంక్షోభమువలన పరమాణువులలో ఈ వేగ మేర్పడుచున్నది అపుడు ధనుస్సునుండి వదలిన బాణములవలె పరమాణువులు విడివిడిగా అతివేగముగా సంచరించుచుండును తగ్గిన గాని వాటిలో సంయోగమున కనువైన క్రియలు ఏర్పడవు ప్రళయాంతమున భూతసంక్షోభజనితమగు ఈ తీవ్రతరవేగము తగ్గును ఒక వేయి యుగముల కాలము ఈ ప్రళయావస్థ యని, దానినే పరమపురుషునకు రాత్రికాలముమని మనకు వేదము చెప్పుచున్నది

రాత్రిం యుగసహస్రాంతాం త్వహోరాత్రవిదో జనాః

అటుతర్వాత జీవుల భోగానుభవముకొఱకు పరమేశ్వరునకు సృష్టి చేయవలె ననెడి కోరిక కలుగగా అదృష్టముతో కూడిన ఆత్మలకు అణువులతో సంయోగముచే వాయుద్వ్యణుకములు బయలుదేరును తదుపరి వాయుత్ర్యణుకములు, మహావాయువు క్రమముగా నేర్పడి ఆకాశమున కంపించుట మొదలిడును తదుపరి జలపరమాణువులచే వెనుకటివలనే జలముద్భవించి ప్రవహించుట ప్రారంభించును తరువాత పృథివీపరమాణువులచే అచటనే మహాపృథివి ఏర్పడును

పరమేశ్వరాధిష్ఠితములైన పరమాణువులతో ఏర్పడుతోంది ఈ ప్రపంచం

ఆ మహాపృథివియందే తేజస్సుయొక్క పరమాణువులచే ద్వ్యణుకాది క్రమమున ప్రకాశమానమగు ఒక తేజోరాశి ఏర్పడును ఇట్లు నాలుగు భూతము లేర్పడిన తరువాత పరమేశ్వరసంకల్పముచే పార్థివ - పరమాణువులతో కూడిన తైజసాణువులతో ఒక పెద్ద అండమేర్పడును పార్థివ - తైజస అణునిర్మాణ మగుటచేతనే దానికి హిరణ్యాండ మని ప్రతీతి దానియందు చతుర్దశభువనములతో చతుర్ముఖబ్రహ్మను ప్రజాసృష్టికై పరమేశ్వరుడు నియోగించును ఆ బ్రహ్మ జ్ఞాన - వైరాగ్య

ఐశ్వర్యాతిశయసంపన్నుడై ప్రతిజీవియొక్క కర్మఫలమును బాగుగా గమనించి కర్మలకు తగిన జ్ఞాన - భోగ - ఆయుష్యములు కల ప్రజాపతులను మనువులను, ఋషులను, పితరులను మొ బహువిధమగు తన సంతానమును సృష్టించి వారి వారి సంస్కారముల కనుగుణములగు జ్ఞాన - వైరాగ్య, ఐశ్వర్యములను వారి కొసంగును ఇట్లు పరమేశ్వరాధిష్ఠితములైన పరమాణువులచే ప్రపంచమేర్పడుచున్నది ఇచట ఈ క్రింది వైశేషికసూత్రములు గ్రాహ్యములు

1 అగ్నేః ఊర్ధ్వజ్వలనం, వాయోస్తిర్యగ్గమనం, అణూనాం మనసశ్చ ఆద్యకర్మ అదృష్టకాంతమ్ [5 2 13]

2 అన్యతరకర్మజ ఉభయకర్మజః సంయోగజశ్చ సంయోగః [7 2 9]

3 సంయోగాద్వా [10-2-2]

4 నోదనాభిఘాతాత్ సంయుక్తసంయోగాచ్చ పృథివ్యాం కర్మ

## ఆధునిక పరిశోధనలు

### ఎంపిడోకిల్స్

క్రీ పూ 5 వ శతాబ్దములో గ్రీకుతత్త్వశాస్త్రజ్ఞులలో ప్రసిద్ధుడు ఎంపిడోకిల్స్ ఇతడు నిప్పు - గాలి -నీరు- పృధివి అను నాలుగు పదార్థముల ద్వారా అనేక పదార్థము లేర్పడుచున్నవని చెప్పినాడు ఇవి నాశపరిణామములు లేని పదార్థములు రాగద్వేషములు వీటి కలయికను గాని వేర్పాటును గాని నిర్ణయించు నని ఇతని మతము

### అరిస్టాటిల్

ఎంపిడోకిల్స్ తరువాత క్రీ పూ 4వ శతాబ్దములో అతని సిద్ధాంతములను వ్యాప్తిలోనికి తెచ్చినవాడు అరిస్టాటిల్ అలగ్జాండర్ చక్రవర్తికి ఇతడు గురువు ఇతడు జ్ఞానమును ప్రయోగముల ద్వారా నిరూపించవలెనను మార్గమునకు పునాది వేసెను పరమాణువులచే ద్రవ్యము నిర్మితమను సిద్ధాంతమును అంగీకరింపక భౌతికప్రపంచమంతయు ఒకే రకమగు విశ్వపదార్థముతో నిర్మింపబడిన దను సంప్రదాయమును ప్రచారము చేసెను ఈ విశ్వపదార్థము రూపములతో గలియుటవలన నాలుగు మూలపదార్థములు నీరు - నిప్పు- గాలి - భూమి అనునవి వేడి, పొడి, చల్లదనము, తడి యనెడి గుణములతో కలసియున్నవని ఇతని మతము

భౌతికపదార్థము లన్నియు ఈ నాలుగు మూలపదార్థముల కలయిక వలననే ఏర్పడునని తర్కశాస్త్రసాహాయ్యమున ఇతడు వాదించెను ఇతని సిద్ధాంతము 17 వ శతాబ్దము చివఱివఱకు చెలామణిలో నున్నది

## లూసిపస్ - డెమోక్రిటస్

క్రీ పూ 4వ శతాబ్దమున గ్రీకుతత్త్వజ్ఞుడగు లూసిపస్ పరమాణు వాదమునకు బీజావాపనము జేసినాడు ఈతని శిష్యుడే డెమోక్రిటస్ ఈతడు ఈ పరమాణువాదమును బాగా ప్రచారమొనర్చినాడు ఇత డెన్నో శాస్త్రములను జదువుకొని ఎన్నెన్నో పరిశోధనలను సల్పినాడు ఇతనిని సమకాలీనులు పిచ్చివా డనుకొనెడివారు ఇతని సిద్ధాంతములను ఎపిక్యూరస్ ప్రచారము చేసినాడు ఇతడు క్రీ పూ 3 వ శతాబ్దములో జీవించినాడు క్రీ పూ 1వ శతాబ్దములో లుక్రీషియస్ అను నాతడు పరమాణువాదమును పద్యములలో నిరూపించినాడు పరమాణునిర్మి తము ద్రవ్యమనియు, పరమాణువులు నిత్యములనియు సదా చలనము గలిగి యుండుననియు నిరూపించెను

## రాబర్ట్ బాయిల్

17 వ శతాబ్దములో వెరిషుదేశస్థుడగు రాబర్ట్ బాయిల్ అనువాడు అరిస్టాటిల్ సిద్ధాంతమును మూలపదార్థతత్త్వమును శాస్త్రప్రయోగము లపై దెలిసికొనవలెనే గాని ఊహలో అది విశదపడదని ఖండించినాడు అతడు మూలపదార్థమున కిచ్చిన లక్షణ మిది

"ఒక పదార్థము రెండు, లేక అంతకంటె నెక్కువ భిన్నపదార్థ ములలోనికి విభజింపబడకపోయినచో నది మూలపదార్థము"

బాయిల్ పరమాణువాదమును సమర్థించినాడు ఈతని సమకాలి కుడగు న్యూటానుకూడా పరమాణువాదము నంగీకరించినాడు

## జాన్ డాల్టన్

క్రీ శ 1766 వ సం ఇంగ్లండులో ఈగిల్స్ ఫీల్డు అను కుగ్రామమున ఒక నిరుపేదకుటుంబమున జాన్ డాల్టన్ అనువాడు జన్మించి పరమాణుసిద్ధాంతమున కొన్ని మార్పుల నూహించినాడు

ద్రవ్యము పరమాణువు లనబడు కడు చిన్న కణములతో నిర్మింప బడినది అవి కంటికి కనపడవు అవి నిత్యమైనవి అవిభాజ్యమైనవి

వాటిని బ్రద్దలుకొట్టుట కాని, నాశనము చేయుట కాని శక్యముకాదు క్రొత్తగా సృష్టింపజాలము పదార్థమును ఒకదానినుండి ఇంకొకదానిలోనికి మార్చుటలో ఆ పరమాణువులను, వాటి జట్లు నుండి విడదీయుటయో లేక దూరముగా నున్న వాటిని దగ్గఱకు చేర్చుటయో రసాయనశాస్త్రము చేయుచున్నది ప్రతిమూలపదార్థమునకును పరమాణువులు కలవు రేండు మూడు మూలపదార్థముల పరమాణువులు కలసి సంయోగపదార్థమునకు కారణమైన సంకులపరమాణువును (compound atom) తయారుచేయును" అనునది స్థూలముగ వాని మతము

ఏవగ్రడ్రో

క్రీ శ 1811 లో ఇటాలియన్ తత్త్వవేత్త ఏవగ్రడ్రో సంయోగపదార్థముల చిన్నకణములకు అణువులు (Molecules) అని పేరు పెట్టినాడు ఒక సంయోగపదార్థపు అణువులో కొన్ని పరమాణువు లుండుననియు, రెండేసి కలసి జట్లు కట్టుననియు ఇతడు కనిపెట్టినాడు ఆ జట్లు కూడ అణువులనియే వ్యవహరింపబడును కణాదుని పరమాణువాదాన్నే గ్రీకు తత్త్వవేత్తలు అనుసరించారు

**ఆధునికుల అణువిభాగము**

సంయోగపదార్థమునకు సంకుల పరమాణువు (compound atom) కారణము దీనిలో చాలా పరమాణువు లుండును దీనిలో గల చిన్న కణములకు మాలెక్యూల్స్ (Molecules) అని పేరు వీటిలో జట్లు కట్టిన కొన్ని పరమాణువుల జంట లుండును రెండు పరమాణువులు ఒక జట్టుగా చేరుతుంటాయి పరస్పరవిరుద్ధావేశము కల ప్రోటాను (proton) ఎలక్ట్రాను (Electron)ల సమ్మేళనానికే పరమాణువు (Atom) అనిపేరు అదే ఉదజని (Hydrogen) పరమాణువు ఎలక్ట్రాను కంటే ప్రోటాను సుమారు 2000 రెట్లు బరువుగా ఉంటుంది కాని ఘనపరిమాణంలో ప్రోటాను కంటే ఎలక్ట్రాన్ పెద్దది

ఈ ప్రోటాను ఎలక్ట్రానును ఆకర్షిస్తుంది ఆ రెండు ఒకప్పుడు ఐక్యమౌతుంటాయి అవి ఐక్యమైనప్పుడు (Neutron) న్యూట్రాన్ ఏర్పడుతుంది ఈ న్యూట్రానులు ప్రోటానులు చేరి చాలా బలంగా చిన్న చిన్న కూటాలుగా ఏర్పడి వాటి చుట్టు ఎలక్ట్రానులను తిప్పుకుంటూ ఉంటాయి

ఆటంబాంబు

పరమాణువును నిర్మించునపుడు దానిలోని మూలకణముల బరువు లలో కొంతభాగము కనపడుటలేదు ఉదా -

హీలియము పరమాణువులో 2 ఉదజని పరమాణువులును రెండు న్యూట్రానులును కలవు

| | |
|---|---|
| 2 ఉదజనిపరమాణువుల బరువు=2 × 1 008= | 2 016 |
| 2న్యూట్రానుల బరువు =2 × 1 009= | 2 018 |
| మొత్తము= | 4 018 |
| హీలియము పరమాణు బరువు= | 4 002 |
| తేడా= | 0 32 |

హీలియము పరమాణువును నిర్మించునపుడు దానిమూలకణముల బరువు మొత్తమునకును తేడా 032 యూనిట్లు వచ్చినది ఇట్లే ప్రతి పరమాణునిర్మాణమునకు కొంత బరువులో తేడా వచ్చుచున్నది ఆ ద్రవ్యమేమైనదో చాల కాలము ఎవరికిని తెలియలేదు క్రీ శ 1910 వ సం జర్మన్ దేశీయుడగు వెన్‌స్టయిన్ సాపేక్ష(Relativity) సిద్ధాంతమును స్థాపించిన తరువాత ఈ విషయమున స్పష్టమైన అభిప్రాయమును పరిశోధనకు లేర్పరచుకొనిరి దీనిద్వారా ద్రవ్యమే తరిగిపోయి అత్యధికశక్తి నుత్పత్తి చేయునని తేలినది ఇట్లే పరమాణుని ర్మాణమునందే గాక పరమాణువిచ్ఛేదమున గూడ శక్తి యుద్భవించును యురేనియము రేడియము, మొ బద్దలైనపుడు శక్తివంతములగు కిరణము లేర్పడును అపుడును ద్రవ్యనాశము కనబడుచున్నది

క్రీ శ 1939 వఱకు పరమాణువునుండి కొన్ని కణములను మాత్రమే విడదీసి దానిలో గలుగు శక్తిని గూర్చి తెలిసికొనబడినది కాని 1939 లో హాన్ అను జర్మన్ దేశీయుడు పరమాణువు మధ్యగా రెండు ముక్కలగుట ద్వారా కలుగు శక్తిని కనిపెట్టినాడు స్వీడన్ శాస్త్రజ్ఞులు ఫ్రిష్, లీసామైట్నర్ అనువారు ఈ విచ్ఛేదమునకు 'ఫిషన్' అనుపేరు పెట్టినారు 1940 నాటికి యురేనియము, థోరియము,

ప్రోటోయాక్టీమియము అను మూడు పదార్థముల పరమాణువులను న్యూట్రానులద్వారా సగము ముక్కలు జేసి శక్తిని పుట్టింపవచ్చునను విషయము తేలినది తదుపరి తేలికరకము యురేనియమును ఉపయోగించుటవలన విచ్ఛేదము తనంత తాను వ్యాపించుటకు వీలున్నదని అణుబాంబుపై దృష్టి మరలినది తేలికరకము యురేనియముగాక ప్లుటోనియము కూడా అణుబాంబులో నుపయోగించునని తెలిసికొనబడినది ఈ పరమాణుబాంబుకు వెయ్యిరెట్లు నాశనశక్తి గలది ఉదజని బాంబు Hydrogen bomb

ఇట్లు పరమాణుశక్తిని ఆయుధరూపముగా నుపయోగించువఱకు మానవుని నవమేధ పెరిగినది

అణుస్వరూప- స్వభావముల గూర్చి ఇంతవఱకు మనము రెండు రకముల దృక్పథముల స్థూలరూపముల నవగాహన మొనర్చుకొనినాము అందు మొదటిది క్రీ పూ 6వ శతాబ్దసమయమునకు ప్రచారములో నున్నదని కొందఱభిప్రాయపడినను చాలా ప్రాచీనమైనది ఇక రెండవది ఇటీవల ప్రారంభమై కాల - దేశ - వ్యక్తి - ప్రభావములచే అనతికాలములోనే అనల్పప్రచారపథము నందుకొన్నది యథార్థజ్ఞానసంపాదనముకొఱకీ రెండు మార్గములలోను కృషిసాగినది, సాగుచున్నది గాన ఎప్పటికప్పుడు సింహావలోకనములు రెండు మార్గములకును చాల అవసరము

అతీంద్రియజ్ఞాననిధి అయిన కణాదమహర్షి సృష్టినిగూర్చి పరమాణుకారణవాదమును గూర్చి సహేతుకముగా నిరూపించినాడు నిత్యద్రవ్యములందు పరస్పరభేదమును గుర్తించుటకు విశేషమను పదార్థమును కనుగొనినాడు సకలదర్శనమూలభూతములగు సిద్ధాంతములను ప్రథమముగ తన దర్శనమున ఎన్నింటినో నిరూపించినాడు

కణాదుని పరమాణువాదమునే గ్రీకులు అనుసరించి దానిపై కొన్ని సిద్ధాంతముల జేసిరి నిన్న మొన్నటి పరిశోధనలో బయల్పడిన అనేక విషయములను కొన్ని వేల సంవత్సరాలకు పూర్వమే ఆయన సకారణముగ నిరూపించెను అందు మచ్చుకు కొన్నిటి నిట ఉదాహరించుచున్నాను-

**మానవమేధస్సుకు నేటికీ అందని**
**సూత్రాలెన్నిటినో చెప్పాడు కణాదుడు**

"ద్రవ్యము పరమాణువులచే నిర్మింపబడినది పరమాణువులు కంటికి కనపడునవి కావు అవి శాశ్వతమైనవి అవిభాజ్యమైనవి

వాటిని బద్దలు కొట్టుటకాని, నశింపజేయుట కాని, సృష్టించుట కాని దుర్లభము" ఇది డాల్టన్ సిద్ధాంతము 1984 నాటికిది, స్థిరమైన ప్రచారములో నున్నది

ఈ విషయమును కణాదుని వైశేషిక దర్శన మెపుడో ఇట్లు నిరూపించినది

"పృథివీ ద్వివిధా నిత్యా చానిత్యా చ పరమాణులక్షణా నిత్యా, కార్యలక్షణా త్వనిత్యా సా చ స్థైర్యాద్యవయవ సన్నివేశవిశిష్టా పరజాతిబహుత్వోపేతా శయనాసనాద్యనేకోపకారీ చ త్రివిధం చాస్యాః కార్యమ్ శరీరేంద్రియవిషయసంజ్ఞకమ్ శరీరం ద్వివిధమ్ యోనిజ మయోనిజం చ" తత్రాయోనిజ మనపేక్ష్య శుక్రశోణితం దేవర్షీణాం శరీరం ధర్మవిశేషసహితేభ్యః అణుభ్యః జాయతే క్షుద్రజన్తూనాం యాతనాశరీరాణి అధర్మవిశేషసహితేభ్యః అణుభ్యః జాయన్తే శుక్రశోణిత సన్నిపాతజం యోనిజమ్ తద్ద్వివిధం జరాయుజమండజం చ మానుషపశుమృగాణాం జరాయుజమ్ పక్షిసరీసృపాణాం అండజమ్ "సదకారణవన్నిత్యమ్" "తస్య కార్యం లింగమ్" "కారణాభావాత్ కార్యాభావః" తత్పునః పృథివ్యాదికార్యద్రవ్యం త్రివిధం, శరీరేంద్రియవిషయసంజ్ఞకమ్ [4-2-1] తత్ర శరీరం ద్వివిధం యోనిజమయోనిజం చ [4-2-5]

విలక్షణాగ్నిసంయోగమువలన పరమాణువులో రూపపరావృత్తి కలుగును గాని మహత్వదార్థములందు గాదని క్షణప్రక్రియల నిట్లు నిరూపించుచు మానవమేధస్సునకు నేటికిని అందని విషయముల నెన్నింటినో వైశేషికులు నిరూపించినారు

ఒక పదార్థములో అగ్నిసంయోగమువలన ఒక రూపము పోయి ఇంకొకరూపము ఎట్లు వచ్చునను విషయమున ఈ క్షణప్రక్రియ మన కుపయోగించును

"అగ్నిసంయోగాత్ ద్వ్యణుకారంభక పరమాణౌ కర్మ తతో విభాగః తత అరంభకసంయోగనాశః తతో ద్వ్యణుకనాశవిభాగజవిభాగౌ [1] తతః శ్యామనాశపూర్వసంయోగనాశౌ [2] తతో రక్తోత్పత్త్యుత్తరసంయోగౌ [3] తతో వహ్నినోదనజన్యపరమాణుకర్మణో నాశః [4] తతోఽదృష్టవదాత్మసంయోగాత్ ద్రవ్యారంభానుగుణా క్రియా [5] తతో విభాగః [6] తతశ్చ పూర్వసంయోగనాశః [7] తత అరంభక సంయోగః [8] తతో ద్వ్యణుకోత్పత్తిః [9] తతో రక్తోత్పత్తిః [10]

ఇచట అగ్నిసంయోగమువలన నల్లని రూపము పోయి అణువు లలో ఎట్లు ఎట్టిని రూపమేర్పడుచున్నదో మచ్చుకు నిరూపింపబడినది ఇందుకు పద్మిక్షణముల కాలము పట్టును

2 ప్రతి మూలపదార్థమునకు పరమాణువు లుండునని డాల్టన్ సిద్ధాంతము
కణాదుడు తానంగీకరించిన మూలపదార్థములకు పరమాణవు లున్నట్లు స్వయముగ ప్రతిపాదించినాడు

3 మూలపదార్థభేదముల ననుసరించి పరమాణువులు విభిన్నముగా నుండునని డాల్టన్ వాదము

* పరమాణువులలోను ఇతర నిత్యద్రవ్యములలోను పరస్పరభేదము కు గలిగించు "విశేషము" అను పదార్థమునే కనుగొనినాడు

"నిత్యద్రవ్యవృత్తయో వ్యావర్తకా విశేషాః"

4 "ఏ విధముగానైన ఏ పదార్థము రెండు లేక అంతకంటె నెక్కువ భాగములుగా విభజింపబడక యుండునో దానిని మూలపదార్థ మనవచ్చును"
అని రాబర్ట్ బాయిల్ 17వ శతాబ్దములో కనుగొనెను

* పరమాణువులే సృష్టికి మూలములని తన వైశేషికదర్శనమున నిరూపించిన కణాదుడే పరమాణువులు నిరవయవములనియు, నిత్యములనియు, అవిభాజ్యములనియు అంగీకరించి వాటిద్వారా ఏర్పడు పదార్థములకు పై లక్షణమును కనుగొనినాడు

5 రెండు, మూడు మూలపదార్థములు కలసిన సంయోగపదార్థ మేర్పడునని ఆధునికసిద్ధాంతము

* తేజస్సుయొక్క - పృథివియొక్క విలక్షణసంయోగముచేతనే సువర్ణ మేర్పడినదని వైశేషికు లంగీకరించినారు

6 రెండు మూడు రకముల పరమాణువులు నిండు సంఖ్యలో కలిసినచో సంకులపరమాణు వందురు

* దానినే వైశేషికులు ద్వ్యణుకమనిరి (Dyads) ద్వ్యణుకమనగా రెండు పరమాణువుల కలయిక వలన నేర్పడునది

7 క్రీ శ 1811 లో ఏవగడ్రో సంయోగపదార్థముల అతి చిన్న కణములకు అణువులు (Molecules) అను పేర్లు పెట్టెను అణువులనే ఈ కణములచే సంయోగపదార్థము నిర్మింపబడును
[illegible] పరమాణువు లుండును

అణువుల నిట్లు విభజించినాడు

జాలాంతరగతే భానౌ సూక్ష్మం యద్దృశ్యతే రజః,
ప్రథమం తత్ప్రమాణానాం త్రసరేణుం ప్రచక్షతే

ఇట్లు త్రసరేణువు సాధింపబడినది రెండు పరమాణువులు కలసి నచో ద్వ్యణుక మేర్పడును త్రసరేణువులో 3 ద్వ్యణుకము లుండును కనుకనే దానిని త్ర్యణుకమనియు చెప్పదురు చతురణుకాదులును కలవు

8 రూధర్ ఫర్డ్ పరిశోధనలవలన నాటికి పరమాణువులు విభాజ్యముల నియు తెలిసికొనబడినది సృష్టికి పరమాణువుల కంటె మూలమైన విద్యుద్యుతమైన కణములు కూడా కారణములని తెలిసినది పర మాణువు మధ్యలో అతిసూక్ష్మము, బరువునైన కేంద్రకముండును (Nucleus) దాని చుట్టును ఎలక్ట్రానులను ఋణవిద్యుదావేశము కల కణములును, అట్లే ధనవిద్యుదావేశముకల ప్రోటానులను కణ ములను తిరుగుచుండును ఇవి కాక కేంద్రకములో న్యూట్రాన్లు (Neutrons) అనే ఇతరపరమాణువులున్నాయి ఎలక్ట్రానును ప్రోటాను ఆకర్షించినపుడు ఆ రెండు కలసిపోగా న్యూట్రాను ఏర్పడుతుంది వీటికి కూడా విద్యుదావేశం లేదు కేంద్రకంలో ధనవిద్యుదావేశం కల ఇంకో అణువున్నది దీని పేరు ప్రోటజాన్ అంటారు ప్రోటజానులు + న్యూట్రానులు = ప్రోటాన్లు అని కొందరి అభిప్రాయము అణుకేంద్రం పగులగొట్టినపుడు బయటపడే శక్తికే ప్రోటజాను అనే వ్యవహారమున్నది

* ఇది చాలా భ్రమలకు ఆలవాలమైన ఘట్టము విజ్ఞులు పరిశీ లించదగిన ఆలోచన లనేకం కల్గుతాయి దీనిని ఆలోచిస్తే ఇలా అనిపిస్తున్నది

ఎలక్ట్రానును, ప్రోటానును, పరమాణువులుగా తీసుకొనుటవలన ఎలక్ట్రానుధర్మములు తేజఃపరమాణువుల ధర్మములతోను, ప్రోటాను ధర్మములు పృథివీపరమాణువుల ధర్మములలోను సరిపోవుచుండు టవలనను, ఎలక్ట్రానును ప్రోటాన్ ఆకర్షించినప్పుడు ఆ రెంటి కలయికలో పుట్టినది న్యూట్రాన్ అనుటవలనను తేలికగా నుండు స్వభావంకల ఎలక్ట్రాను తేజఃపరమాణువనీ దాని కంటే సుమారు 2000 రెట్లు బరువుగల ప్రోటాను పృథివీపరమాణువని ఎలె క్ట్రాను +ప్రోటాను =న్యూట్రాను అగుట అంటే ద్వ్యణుకంగా

తయారు అగుట అనీ అనిపించుచున్నది ఇది ఒకరకంగా కణాదుని పరమాణునిర్వచనాలకు దగ్గరలో నున్నది

కనుకనే 1940 లో జరిగిన పరిశోధనద్వారా యురేనియం, థోరియం, ప్రోటో యాక్టీనియం అను పదార్థముల పరమాణువులను న్యూట్రానుల ద్వారా సగము ముక్క జేసి శక్తిని పుట్టించవచ్చుననునది సలక్షణముగా కుదురుచున్నది

అణుబాంబులో అణుపదమును వైశేషికుల [త్ర్యణుకముగా] త్రసరేణువుగా తీసుకొనవలెను త్రసరేణువులలో మూడు ద్వ్యణుకము లుండును అనగా 6 పరమాణువు లుండును కృత్రిమయంత్రసామగ్రిచే పృథివి + తేజః = పరమాణుద్వ్యణుకముతో జలద్వ్యణుకమును ఛేదించినపుడు విలక్షణమైన శక్తి ఏర్పడును ఆ శక్తియే అణుశక్తి (Atomic energy)

ఉదా - కుంపటిలో తేమగల బొగ్గులకు తేమలేని పొడి బొగ్గులతో నిప్పు ముట్టించినపుడు వాయుపీడనముతో కొన్ని బొగ్గులలో స్ఫోటనము కలిగి ఎగిరెగిరి పడుచు రవ్వలను సృష్టించును ప్రభావరహితమైన స్థూల పదార్థములలోనే ఇంతటి శక్తి కనపడుచుండ మహాప్రభావసంపన్నములైన అణువుల విషయమున తప్పక గొప్ప శక్తి బయల్వెడలుటలో సందేహమేముండును ఇట్లే ఉరుములు, పిడుగుల విషయ మూహింపవచ్చును ఇచట కణాదసూత్రములు

"అపాం సంఘంతో విలయనం చ తేజస్సం యోగాత్ [5 2 8]

తత్ర విస్ఫూర్జథుర్లింగమ్[5 2 9]

అపాం సంయోగాత్ విభాగాచ్చ స్తనయిత్నోః [5-2-11]"

ఇట్లు నవీనపరిశోధనల ప్రభావాతిశయములను, ప్రాచీనుల అతీంద్రియజ్ఞానమును సూక్ష్మదృష్టితో చూచి మన దర్శనములకు యాంత్రిక నిర్ణయములకు పొత్తు ఎంతవఱకు కుదురునను సమన్వయభావనకై మన దేశమున చాలా కృషి జరుగవలసియున్నది